# శ్రీ విద్యాశంకరలీల

కవితావతంస, కావ్యతీర్థ,

ఘట్టి లక్ష్మీనరసింహ శాస్త్రి

తెనాలి

శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీపీఠము
శ్రీ సదనము — గుంటూరు



శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయమ్,

నమామి భగవత్పాదశంకరం లోకశంకరమ్,



జయన్తి జగదానన్దకారిణః కలిహారిణః.

కల్యాణానన్దగురురాట్పదపఙ్కజపాంసవః.

శ్రీ

## శ్రీ కల్యాణానందభారతీ మాంతాచార్య గురుస్తుతి

ఎలసినపేర్మినేర్మి నెనయించి నయించినరీతి బ్రాఁతి నా
కలితకలావిలాసము లఖండములున్ బుధమండలీనుతం
బులుగ నటించుచున్నయది భూస్థలి నాస్థన భారతీమత
ల్లి లలిత మీ భవత్తనువులీల మెయిం గొని సద్గురూత్తమా !
అవుచాయం గొన సిద్ధవాగ్విలసనం బవ్యాజ మనోజ్ఞ తే
జవతారం బవధారుతీ రెనసి తీ వచ్చుంపుకర్మందివై ,
మివులం దమ్ములతమ్ము లీ పదములన్ మేకొన్న మేల్చెన్నెలం
దవె నాసేతుహిమాచల మ్మిల కృతిత్వప్రాప్తి భూమాకృతీ !

కలిపితి గంగలో నలుసముల్ కుత్సిత
　　　　కామతవాదముల్ కట్ట గట్టి,
నిలిపితి నెలకొన్న నెఱి మేల్మి నెఱయింప
　　　　నద్వైతసూత్ర మవ్యాహతమ్ము,
సలిపితి వాచార్యచంద్రుభాష్యమ్మును
　　　　ద్దేశమ్ము లెస్స ప్రకాశితమ్ము,
తెలిపితి వటు తేట తెల్లమ్ముగా విధే
　　　　యులు వినేయులకుఁ జిత్కళికకలలు,

మలిపితివి మునుముచ్చులై బలిసి పీట
వెట్టుకొన్న సన్యాసుల గుట్టు మట్టు
రట్టురవ్వకుఁ గొనివచ్చి రథ్యలఁ బడఁ,
బరమహంసవతంసుండ ! గురువరుండ !

తలకున్ మీఱినసౌరు గూర సునిరాతంకస్థితిం బాఱునీ
విలసద్వైదికబోధదీధితి దిశావీథిం గొనం దేజముల్
తలలం దాఁచుకొనం బొకాలినది దుర్ద్వైతానువాద్యాహ్వాయం
బెలయం గొన్న దివాంధపాళి యిలు గా నేమట్రిలోత్రొట్రిలో !

ఇల జనిఁ గన్ననాఁటిసుత హృత్కుహరమ్మున సుస్థిరమ్మునై
పొలిచి తలల్ నిగుడ్చుతలఁపుల్ ఫలితత్త్వమహమ్ము నిమ్ముకోఁ
గలిగెఁ; గులేశ్వరిన్, శ్రమణకాంతుని, శంకరు లోకశంకరున్,
లలి నెలకొల్పుమెల్పునఁ గలం బొసఁగించితి వంచితప్రవా !

ఉపనిషత్సారంబు లూర మాటన మాట
భాష్యబోధనమునఁ బరఁగుఘనులు,
కడకొనుచాతురిఁ గలదర్శనములకు
లోచన మ్మొసఁగు నలు ప్తయశులు,
పల్కుపల్కునఁ దేనె లొల్కు కమ్మనికైతఁ
జే రెన్నికం గొన్న పెద్దకవులు,
లలిని బ్రకరణమ్ములకుఁ బ్రకరణములు
వ్యాఖ్యాతముల్ జల్పు ఖ్యాతమతులు,

మొనసి చుక్కలు లెక్కిడు ఘనులు, న్యాయ
విదులు, బుధులు, భిషగ్వరుల్, వెలయువార
లష్టదిగ్గజములటు మీఱయంతికమున
గురు! మహారాజ! జగములగురుఁడ వీవు.

శ్రీః

# తొలి పలుకు

## శ్రీ విద్యాశంకర పదమూలావేశ ప్రకాశిత జగద్గురు
## శ్రీ కల్యాణానందభారతీ మాంతాచార్య మహాస్వాములవారు

శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయమ్,
నమామి భగవత్పాదశంకరం లోకశంకరమ్.

భారతవర్షపుటతిశయమునకు నిదానమగు భారతీసంప్రదాయమున నఖండ యశము నొందుచుండిన శ్రీ విద్యాశంకరభగవత్పాదుల పవిత్ర నామము నీ చతురంభోధిపరీతంబగు భూమండలంబున వినియుండనివార లెక్కాలమున నుండరనువిషయ మొక వింతగాదు. కాని యట్టిమహామహుని పావనచారిత్రము నున్నదాని నున్నట్లుగ గుర్తెఱింగినవారలు మాత్ర మరుదుగ నుందురు. ఏలయన, నామహామహునిపావనచారిత్రములను రచించిన వార లట్టి మహనీయునియొక్క మహిమాతిశయములను వర్ణించితి మను వ్యాజమున నపూర్వములగు గాథలను గల్పించి విశేషవర్ణనలతో నా పవిత్రచారిత్రము నంతయుఁ జీకాకునొందించి యున్నారలు. అందులకు దార్కాణము ప్రకృతమునఁ బుష్కలప్రచారమును గనుచుండిన శంకర విజయ మను కావ్యమే. అయ్యది శ్రీ విద్యారణ్యగురువులచే రచింపఁ బడినట్లు లోకమునకు వ్యామోహమును గలుగజేయు మాధవకృత మని సర్వవిధములఁ బ్రచారముచేయఁ బడుచున్నది. ఒక్కపెట్టున సంక్షేపం

బుగఁ జెప్పినచో నీ మాధవకృతశంకరవిజయ మనునది శ్రీ విద్యా శంకరభగవత్పాదులచే భారతీసంప్రదాయసార్వభౌములగు పరమహంస పరివ్రాజకాచార్యవర్యులకు నిలయముగా నుండునట్లు శ్రీ సురేశ్వరాచార్యులను జగద్గురువుగ పట్టాభిషేకము గావించిన శృంగగిరిక్షేత్ర మునఁ బవిత్రతమంబగు భారతీసంప్రదాయమును సర్వవిధముల మట్టి యందు గలిపి యందులకు విపరీతముగ మురికినాటియజుశ్శాఖీయబ్రహ్మచారులకు సన్యాసివేషమును వేయించి యట్టిదుష్కార్యమే శ్రీ విద్యా శంకరభగవత్పాదాశయమనియు, శ్రుతిస్మృతిసదాచారసిద్ధ మగు ధర్మ మనియు, లోకమును విశ్వసింపఁజేయుచుఁ బలువిధములగు ధర్మవిప్లవ కార్యములను స్వోదరపూరణమునకై సర్వకాలములయందును గావించుచు నిజేచ్ఛఁ జరించుచు శృంగగిరిక్షేత్రము నాక్రమించి జీవించుచుండిన శాపదగ్ధబ్రాహ్మణాధముల వంచకకార్యవిశేషము గాని వేఱొండుగా దని సర్వవిధములఁ జెప్పవచ్చును. ఈ గ్రంథమునుగూర్చి యిట్టి యభిప్రాయమును శంకరకాలాన్వేషణతత్పరులగు విమర్శకు లిదివరకే సర్వవిధములఁ బ్రకటించియున్నారలు.

శృంగగిరిక్షేత్రము నాక్రమించుకొనిన శాపదగ్ధబ్రాహ్మణాధములు తమ యకృత్యములను ధర్మకృత్యము లని లోకులను భ్రమింపఁజేయుఁ బలు విధములగు దుష్టప్రసంగములఁ బవిత్రమంబగు శంకర జీవితమునఁ జొప్పింపఁజేసి యద్భుతములగు గాథలను గల్పించుచు లోకులను భ్రమింపజేయుచు, నందులకు నుపయోగించున ట్లీ గ్రంథమును వ్రాయించి యున్నారలు. ఇందలి ప్రసంగములు బాహ్యమునకు శ్రీ విద్యాశంకరులయం దద్భుతములగు మాహాత్మ్యవిశేషము లుండియున్నట్లు చిత్రింపఁ

బడియున్నవి గాని పరికించిచూడ నవి యన్నియు ధర్మేతరములే గాక సత్యేతరములే యని కోవిదులు గమనింపఁగలరు. అట్టి ప్రసంగముల స్థాలీపులాకన్యాయంబునఁ బ్రదర్శించుచున్నారము—

౧ సన్యాసస్వీకారమునకై మాతాజ్ఞాప్రసంగము.
౨ మాతృవంచనము.
౩ సన్యాసస్వీకారానన్తరము తల్లికి వరప్రదానము.
౪ కాశీక్షేత్రమున వ్యాససంవాదము.
౫ పుల్కసనంవాదము.
౬ భట్టపాదుల గురుధిక్కారప్రసంగము.
౭ శంకరమండనమిశ్రుల యశ్లీలసంభాషణము.
౮ వ్యాసజైమినులయొక్క శ్రాద్ధభోక్తృత్వము.
౯ మండనమిశ్రుల పరాజయానంతరము భారతియొక్క యనౌచిత్య ప్రవృత్తి.
౧౦ వాత్స్యాయనశాస్త్రచర్చ.
౧౧ శంకరపరాజయము.
౧౨ అమరుకశరీరప్రవేశము.
౧౩ నృసింహాస్తవిశేషము.
౧౪ భారతీపరాజయము.
౧౫ కాపాలికసంబన్ధవిశేషము.
౧౬ అభినవగుప్తుని ఆభిచారికప్రయోగము.

౧౭ భగందరరోగపీడ.

౧౮ తన్నివృత్తివిశేషవర్ణనము.

౧౯ అభినవగుప్తునిమరణము.

౨౦ మాతృమరణము.

౨౧ శంకరకృత మాతృ సంస్కారవర్ణనావిశేషము.

౨౨ కేరళదేశీయులకు శాపదానము.

౨౩ సురాపాన లోహపాన విశేషము.

౨౪ సర్వజ్ఞపీఠాధిరోహణసమయమున నాకాశవాణియొక్క యధిక్షేపము.

౨౫ శంకరసమాధానము.

ఇట్లు పలువిధములగు ననౌచిత్య ప్రసంగములు పవిత్రతమమగు జగద్గురు చరిత్రమునఁ జొప్పింపఁబడి యవ్యానిమూలముననే శంకరభగవత్పాదులకు యశంబు వోడమినట్లు కవితాచమత్కృతి యంతయును వినియోగింపఁబడి యున్నది. ఇట్టి యసందర్భములును నశ్లీలంబులు నగు ననౌచిత్య ప్రసంగముల నిషేధరూప మగు విమర్శనము గ్రంథవిస్తర భీతిచే విరమింపఁబడుచున్నది.

ఇట్లు బయలువెడలిన దీ శంకరవిజయ మొక్కటియే కాదు. దీనికి వెను వెంబడి వ్యాఖ్యానవిశేషముగూడ బయలుదేరినది. ఇట్లు మూల వ్యాఖ్యానములు రెండును ఎట్లు ఎపుడు బయలుదేరనవో కాని నాటి గోలె నేటివఱకుఁ దన్మూలకమగు విశేషములే శంకరప్రతాపములట్లు వర్ణింపఁబడుచుఁ బావనమగు శంకరభగవత్పాదచరిత్ర మంతయు నశ్లీ

లంబులతోడను, నపభ్రంశములతోడను, దుష్టప్రసంగములతోడను, సమకూర్పఁబడి యనర్థహేతువుగాఁ బరిణమించుచున్నది. ఇంతియ కాదు—ఈ శంకరవిజయమునకుఁబిమ్మటఁ గొన్ని విజయములుగూడ బయలుదేరినవి. అయ్యవిగూడ నీ శంకరవిజయము నిదానముగాఁ గల్గి యంతకంటె నెక్కుడు దుష్టప్రసంగములతో నొప్పారుచున్నవి. అందులోఁ గుంభకోణపితలాటకంబగు కామకోటిమఠపు దుండగీఁడులచే నచ్చొత్తింపఁబడిన యానందగిరికృతశంకరవిజయ మనునది యగ్రగణ్యము. ఇట్లు బయలువెడలిన దుష్టగ్రంథములవలనఁ గలుగుచుండెడి ముప్పును వారించుటకు సద్గ్రంథరచనముకంటె మార్గాంతరము లేదని తీవ్రముగ యోజించుచుండ నొకనాఁడు మాప్రియశిష్యుండగు శ్రీ ఘట్టి లక్ష్మీ నరసింహశాస్త్రి మాసన్నిధికిఁ జేరి సవినయముగఁ గూర్చుండియున్న సమయమున మామనంబునఁ బొడమియుండిన యభిప్రాయమును జెప్పి యథాశ్రుతంబును, యథార్థపూరితంబును, శ్రుతిస్మృతిసదాచార ప్రమాణాదర్శకంబును, నగు శ్రీవిద్యాశంకరభగవత్పాదలీలను సుకర ముగ నెల్లరకును దెలియునటులు చిన్నప్రబంధమును రచింపవలయు నని సూచింప నందులకు శాస్త్రి భక్తిమీర వల్లె యని పరమానంద ముతోఁ జని—యీ శ్రీవిద్యాశంకరలీల నచిరకాలములో రచించి జగద్గురుకరుణాకటాక్షమునకుఁ బాత్రుఁ డయ్యెను.

ప్రకృతమున రచింపఁబడిన శ్రీవిద్యాశంకరలీల యాంధ్రలోకమునకు శ్రీవిద్యాశంకరభగవత్పాదుల వాస్తవతేజమును బ్రకాశింపఁజేసి యా మహామహునియశోవిశేషమును దుష్టకవులచేఁ జొప్పింపఁబడిన యశ్లీలా సంగతములను వారింపఁ బ్రవర్తింపుచున్నది. ఏతద్గ్రంథముయొక్క

విశేషము నంతయు నాంధ్రలోకమంతయు సుకరముగ గ్రహించుక్రమ మున నతినైపుణ్యముతో రచియింపఁబడియున్నది. అద్దానివిశేషమును జదువరులే సర్వవిధముల గ్రహించి యానందింపఁగలరు.

ఇట్టి పవిత్రగ్రంథమును రచించిన శ్రీ కవితావతంసునకు శ్రీవిద్యా శంకరభగవత్పాదులై హికాముష్మికనిశ్శ్రేయసములననుగ్రహించుఁగాక!

పుమర్థాం శ్చతురో దేయా చ్ఛ్రీవిద్యాశంకరః ప్రభుః,
శ్రీకవితావతంసాయ లక్ష్మీనృసింహశాస్త్రిణే.

నివాసము—తెనాలి
స్వభాను, శ్రావణపూర్ణిమ.

ఇతి నారాయణస్మృతిః



శ్రీః

శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయమ్,
నమామి భగవత్పాదశంకరం లోకశంకరమ్.

# "సంక్షేపశంకరజయము మాధవకృతమా?"

"ప్రణమ్య పరమాత్మానం శ్రీవిద్యాతీర్థరూపిణమ్, ప్రాచీనశంకరజయే సారః సంగృహ్యతే స్ఫుటమ్" అను శ్లోక మాదిగాఁ గల్గి—"శృణ్వ న్నాలోకశబ్దం సముదిత మృషిభి ర్ధామ నైజం ప్రతస్థే" యను చరణ మంతముగాఁ గల్గి పదునాఱు సర్గములతోఁ జిత్రింపఁబడిన గ్రంథ మొకటి మాధవకృత మనియు, సర్వాత్ము శ్రీ విద్యారణ్యవిరచిత మనియు, శ్రీ మచ్ఛంకర దిగ్విజయ మను పేర పూనాపట్టణమునందలి యానందా శ్రమమున ముద్రింపఁబడి ప్రచారమును గని యున్నది. ఏతత్సదృశమగు గ్రంథమే తెలుగులిపియందుగూడ ముద్రింపఁబడియున్నది. ఈ గ్రంథము నకు ధనపతిసూరి యను నాతనిచే రచింపఁబడిన డిండిమ మను టీక యొకటిగూడఁ జేర్పఁబడియున్నది. ఈగ్రంథము మాధవకృతమని లోక మును భ్రమింపఁజేయుటకు నిందు బ్రతిసర్గముయొక్కయు కొనను "ఇతి శ్రీమాధవీయే ...... సంక్షేపశంకరజయే సర్గోఽయం ......అను క్రమమున నొక్కొక శ్లోకముచొప్పున పదునాఱుసర్గములకును పదునాఱు శ్లోకములు గూర్పఁబడియున్నవి. అంతకుఁ దక్క ఈగ్రంథము మాధవ కృతమని వక్కాణింపఁబడుటకు గత్యంతరము గానరాదు.

అదెట్లనిన:—ఈగ్రంథకర్త స్వవిషయమునుగూర్చి మొదటిసర్గమున తొమ్మిది పది పదునేడు శ్లోకంబులం దిట్లు: జెప్పికొనియున్నాఁడు—

"ప్రౌఢోఽయం నవకాలిదాసకవితాసంతానసంతానకో దద్యాత్" ౯

"వాగేషా నవకాలిదాసవిదుషో దోషోజ్ఝితా" ౧౦

"తస్య కావ్యస్య కర్తా ధన్యో వ్యాసాచలకవిసరః" ౧౭

పై శ్లోకములకు వ్యాఖ్యాత యిట్లు వ్యాఖ్యానమును గావించియున్నాఁడు— "అయంప్రౌఢో నవకాలిదాసస్య మాధవస్య కవితాసంతానరూపఃసంతానకః కల్పవృక్షోద్య సముద్యతః"—"త ద్వైనంభూతా సర్వదోష వినిర్ముక్తా నవీనకాలిదాసస్య విదుషో మాధవ స్యైషా వా గ్దుష్టానాం కవీనాం"—"వ్యాస ఇవాచలః స్థిర శ్చాసౌ కవిశ్రేష్ఠ శ్చేతి వ్యాసాచల కవివరః మాధవః ధన్యః కృతకృత్యః"—"తస్యమాధవస్య కృతిం యత్నం జాన న్తీతి తత్కృతిజ్ఞా స్తేఽపిధన్యాః" అని—

మూలగ్రంథమున "నవకాలిదాసపదము రెండుమార్లును వ్యాసాచలకవి యను పద మొకమారును దెలియవచ్చుచున్నవి. కాని మాధవపదము దెలియరాదు. ఇంక వ్యాఖ్యాత యన్ననో మూఁడుస్థలములందును మాధవపదమును బర్యాయపదముగా వాడియున్నాఁడు. వ్యాఖ్యాత యొక్క మాధవపదము శ్రీవిద్యారణ్యులయందే రూఢిని గని యున్న దనుటకుఁగాని, మూలమందలి నవకాళిదాస వ్యాసాచలకవి పదములు మాధవునియం దనికాని, శ్రీవిద్యారణ్యులయం దనికాని, రూఢిని గని యున్నటులఁ దెలిసికొనుటకుఁగాని, యూహించుటకుఁగాని, యించు కేనియు నవకాశము లేదు. మాధవవిద్యారణ్యకృతములగు గ్రంథములు

పెక్కులు సుప్రసిద్ధములుగఁ దెలియవచ్చుచున్నయవి. అయ్యవి మాధవ విద్యారణ్యకృతము లని నిర్ణయించుటకుఁ దగు విశేషములతో నొప్పి యుండున ట్లచ్చట నేవిశేషములు దెలియరాకుండుటయ కాక యచటఁ దెలియవచ్చెడి నవకాలిదాస వ్యాసాచలకవిపదములచే మఱి యేపురుషునిఁగూడ నూహించుటకు నవకాశము లేనంతటి దుస్థితిలో నీపదములున్నయవి. ఒకానొకప్పు డజ్ఞాతకులగోత్రులగువారు కవితానైపుణ్యమును బడసి యెవ్వియేని గ్రంథములఁ జిత్రించినచోఁ దమనామరూప విశేషంబుల నందుఁ జొప్పించినచో దమగ్రంథముల శిష్టులు స్పృశింప సాహసింప రనుభీతిచే నర్థరహితములగు నామాంతరములచేఁ దమ్ము గ్రంథములందుఁ జొప్పించుకొనుట లోకమున నొక వింత యెంతమాత్రమును గాదు. ఆతీరుననే యీ సంక్షేపశంకరజయకర్త దననామ రూపముల మరుగుపరచఁ దలంచి పై నవకాలిదాస వ్యాసాచలకవి పదముల వాడుకొనియున్నాడు. వ్యాఖ్యాత యగు ధనపతిసూరి యన్ననో యెట్టి ప్రమాణము ననుసరించి పై నవకాలిదాస వ్యాసాచలకవి పదములకు మాధవపర్యాయపదమును వాడెనో యచ్చట యేమాధవు నుద్దేశించెనో నిశ్చయించుట కించుకేనియు నవకాశము లేదు.

ఇఁక నీ గ్రంథకర్త యొక విశేషమును వెలిఁబుచ్చియున్నాడు. అ దెద్ది యన — "ప్రాచీనశంకరజయే సారః సంగృహ్యతే స్ఫుటమ్" అని. గ్రంథకర్త దాఁ దెల్పిన దంతయు ప్రాచీనశంకరజయమందలి సారసంగ్రహ మనుచున్నాడు. ఇట్టి నిర్వచనముచేఁ దనగ్రంథమునందలి యనౌచిత్యప్రసంగముల కన్నిటికిఁ దాఁ గర్త గానట్టులను, సుప్రసిద్ధగ్రంథముచేఁ బ్రతిపాదించుటచేఁ దాఁ జేసినప్రసంగములన్నియు యథార్థ

లోకము నమ్ముటకు నవకాశము గల్గు నను నిశ్చయముచే నిట్లు వ్రాసి యున్నాఁడు. ప్రాచీనశంకరజయ మన నెద్ది ? అద్దాని నెవ్వరు రచించిరి ? ఆగ్రంథ మెచట ప్రచారమును గనుచున్నది ? అని యొకవేళ మీమాంసకు లుచితమగు విచారణము గావించినచో నా ప్రాచీనశంకర జయము వంధ్యాపుత్రునిచేఁ గూర్పఁబడిన గగనకుసుమమాలిక యే యగుచు ప్రకృతపు సంక్షేపశంకరజయ మనునది సత్యేతరములతో నొప్పు విప్రలంభకకావ్యముగాని వేరొండు ప్రమాణగ్రంథ మెంతమాత్ర మును గా దని సుస్పష్టముగఁ దెలియవచ్చును. వాస్తవమును యోజించినచో నీ సంక్షేపశంకరజయ మనునది శ్రీవిద్యాశంకరభగవత్పాదుల అఖండయశోవిశేషమును నత్యద్భుతముగ వ్రాయఁబడిన పంచక కృతి యని కాని, లేదా శృంగగిరిక్షేత్రమును దమకుక్షింభరిత్వమున కై యాక్రమించికొని శాపదగ్ధబ్రాహ్మణాధములు దమయకృత్యము లన్నియు శ్రీవిద్యాశంకరభగవత్పాదకృత్యానుకరణములే యని లోకమును మోసగించి స్వకార్యముల నిర్వహించుకొనుటకై సిద్ధముచేసికొనిన సాధన మని తెలియవచ్చును.

ఏతద్విషయము సువ్యక్తముగాగ నీసంక్షేపశంకరజయమునందుఁ జొప్పింపఁబడిన దోషములను స్థాలీపులాకన్యాయమునఁ బ్రదర్శించుచున్నారము. ప్రాజ్ఞులు ప్రయోజనమును గనియెదరుగాక !

౧. ప్రథమసర్గమున—

"ఏకదా దేవతా రూప్యాచలస్థ ముపతస్థిరే
దేవదేవం తుషారాంశు మివ పూర్వాచలస్థితమ్"

అనుశ్లోకము మొదలు—

"తత స్స తారకారాతి రజనిష్ట మహీతలే
భట్టపాదాభిధా యస్య భూషా దిక్షుదృశా మభూత్"

అనుశ్లోకమువఱకుఁ గల ముప్పదిమూఁడుశ్లోకములవఱకును — కైలాస మున దేవతలకును కైలాసాధిపతియగు శంకరునకు నొక సంవాదము జరిగియున్నట్లు వర్ణింపఁబడియున్నది. ఇట్టివర్ణనకుఁ బ్రమాణమునుఁగూర్చి వ్యాఖ్యాత యిట్లు వ్రాసియున్నాఁడు —

"దేవతా బ్రహ్మాద్యా అత్రగ్రాహ్యాః. నిగమాచారపరిభ్రష్టా నాగమాచారరతా న్విప్రాదివర్ణా ననలోక్య సత్యలోకగతేన నారదేన ప్రేరితో బ్రహ్మా స్వభక్తాదిసహితః శివలోక మాగత్య ప్రణిపత్య పంచవక్త్రం శివ మూచ ఇతి ప్రాచీనవిజయోక్తేః" అని.

వ్యాఖ్యాతచేఁ బ్రాచీనశంకరవిజయోక్తిగా నిర్వచింపఁబడిన విషయ మిచట మూలమునందు వర్ణింపఁబడియుండలేదు. ఇఁక ప్రాచీనజయ మం దెద్దియైన నేతత్సదృశవర్ణన ముండియుండనచ్చు నని యనుకొందము. అట్టానియందలి విశేషమునకు మూలప్రమాణ మెద్దియో యొకింత నిరూపింపఁబడనలయును. వాస్తవముచే నేతద్వర్ణనము ప్రాచీన జయానువాద మగుఁ గాక, లేక నవకాలిదాసవర్ణన మగుఁగాక, ఏది యెట్లు లయ్యు నీ ముప్పదిమూఁడు శ్లోకములవలనఁ దెలియవచ్చెడి విషయము నవకాలిదాసనవకల్పనమే యగుచు సత్యేతరవిషయముగ మీమాంసికుల నిర్ణయమునకు నలరారుచున్నది. ఇందు వర్ణింపఁబడిన మహనీయులఁ దత్తద్దేవతావతారము లను నన్మృతవర్ణనమునకుఁ గపి పొల్పడకుండి నచో లోకమున నెక్కుడు ప్రయోజనము ఘటియించెడిని. ఇట్టి యనృతోక్తుల వర్ణించుటచే విద్వాంసులయొక్క విద్వత్త్వమునకుఁ గల గౌర

వాతిశయములు లుప్తములగుటయేగాక విద్వాంసులయొక్క యభివృద్ధి కిని అభివృద్ధిఁజెందు విద్వాంసులయొక్క ఘనతకును బుష్కలమగు ముప్పు వాటిల్లు ననుట యొక వింత గాదు.

౨. ద్వితీయసర్గమున—

శ్రీ శంకరజననకాల మిట్లు డెబ్బదియొకటవ శ్లోకమున వర్ణింపఁబడియున్నది—

"లగ్నే శుభే శుభయుతే సుషువే కుమారం
శ్రీపార్వతీవ సుఖినీ శుభవీక్షితేచ,
జాయా సతీ శివగురోర్నిజతుంగసంస్థే
సూర్యే కుజే రవిసుతే చ గురౌచ కేన్ద్రే."

ఈశ్లోకమువలన శ్రీవిద్యాశంకరభగవత్పాదజననకాలము నించుకేనియు దెలిసికొనుటకు నవకాశము లేదు. ఇందు యుగముగాని వత్సరముగాని తిథివారనక్షత్రములుగాని తెలియ రావు. గ్రహస్థితివర్ణన మగమ్యగోచర మని వేఱెచెప్పనక్కరలేదు. ఈకవికి శంకరజననకాల మించుకేనియుఁ దెలియకపోవుట యటుండ నీతనిచే మాతృకగా గ్రహింపఁబడిన ప్రాచీన శంకరజయపుమర్యాద తేటతెల్ల మగుచున్నది.

3. మూడవసర్గము—

"ఇతి బాలమృగాఙ్కశేఖరే సతి బాలత్వ ముపాగతే తతః
దివిషత్ప్రవరాః ప్రజజ్ఞిరే భువి షట్ఛాస్త్రవిదాం సతాం కులే"

అను శ్లోకము మొదలుగా గల్గిన యెనుబదిమూడు శ్లోకములతో నొప్పుచున్నది. అందు మొదటి పదునారు శ్లోకములును అవతారవిశేష

వర్ణనముతోడను మిగిలిన శ్లోకములు మండనమిశ్ర భారతులయొక్క వివాహవర్ణనా విశేషముతోడను నలరారుచున్నవి. ఇచ్చట నవతార విశేషములనుగూర్చి మొదటిసర్గమున కైలాసప్రస్తావనయందలి ప్రమాణ న్యాయమే వర్తించు నను విషయము వేఱ వచింపనక్కరలేదు. ఐన నింద్రొక విశేషము గమనింపవలసియున్నది. విశ్వరూపు డను నామముచేఁ బేర్కొనఁబడిన మండనమిశ్రు డిందు—

"చార్వాకదర్శనవిధానసరోషధాత్రా
శాపేన గీష్పతి రభూ ద్భువి మండనాఖ్యః"

అని మండనమిశ్రుడు బృహస్పతి యవతారముగా నిర్వచింపఁబడియె— సరస్వతి శాపవశమున మండనమిశ్రునిభార్యగా నొప్పారె నని వర్ణింపఁబడియె. ఇది యొక యద్భుతరచనాచాతుర్యము. కొందఱు మండనమిశ్రు డింద్రుని యవతారమనియు దానంజేసి సురేశ్వరనామ మతనిసాధకనామమనియు నాతనికి సరస్వతి భార్యగా నలరారుటం జేసి సురేశ్వరాచార్యాధిష్ఠితమైన కంచికామకోటి మఠమునందు సన్యాసుల కింద్రసరస్వతి యను నపూర్వసంప్రదాయము లభించె ననియు నీభారతీభూమియందు కుంభకోణపు పితలాటకము వారిచే నట్టహాసముచేయబడుచుండుట నాసేతుశీతనగ మెల్లరకును దెలిసియున్నవిషయమే. ప్రకృతపుగ్రంథమునం దన్ననో మొదటి సర్గమున—.

"బ్రహ్మాపి తే సహాయార్థం మండనో నామ భూసురః
భవిష్యతి మహేన్ద్రోఽపి సుధన్వా నామ భూమిపః" ౧—౫౬

అని చెప్పఁబడియున్నది. మూడవసర్గమునకు నచ్చువఱకు మండనుడు బ్రహ్మశాపముచే నవతరించిన బృహస్పతిగా నిర్వచింపఁబడియున్నాడు

నవకాలిదాసకల్పన యొక్కొకసర్గమున నొక్కొక్కతీరున నవనవముగ బొరలుచున్న ట్లూహింపవలసియున్నది. ఏది యెట్లులున్నను మండన మిశ్రుని మూఁడువిధములుగా లోకము చెప్పుకొనుచున్నదా, లేక కవులు నిజేచ్ఛ వర్ణించిరా, లేక ప్రాచీనశంకరజయ మన్నికల్పనలకుఁ దావునిచ్చు నతిశయముతో నొప్పారుచున్నదా యను విషయమును ప్రాజ్ఞు లొకింత యోజించునది. వాస్తవము నాలోచించినచో నీ యవతారకల్పనము నిర్మూలమై నిరాలంబనమైన కుకవికల్పనముగాని వేరొండు గాదని ప్రాజ్ఞులు గ్రహింపగలరు.

ఈ మూఁడవసర్గమున వర్ణింపఁబడిన వివాహవర్ణనావిశేషమంతయు గవితానైపుణ్యమేతీరున నొప్పారుచున్నను బ్రాహ్మణకన్యావిధాన మును మఱచి యాసురవివాహవిశేషముగ వర్ణించిన నవకాలిదాసు వాస్తవముగా నవకాలిదాసే యను సార్థకతను బడయుచున్నాడు.

☞ పరికించిచూడ నీ మూఁడు సర్గములును ప్రాచీనశంకరజయప్రటనువాదమగుఁగాక, నవకాలిదాసకల్పనావిశేష మగుగాక, సత్యేతరములును ననౌచిత్యములు నగు ప్రసంగములతో నొప్పారుచున్నవి.

౫. నాలవసర్గము—

ఇందీ నవీనకవియొక్క స్వకపోలకల్పనముదక్క భగవత్పాదులయొక్క చారిత్రవిశేషమునఁ దెలియవచ్చెడి దేమియును లేదు. ఒకవేళ విశేషముగాఁ దోఁచినచో నిత్యదరిద్రులు సంతసించఁదగు నుసిరికాయలకథావిశేషమే విశేషము.

౬. ఐదవసర్గము—

ఐదవసర్గము శ్రీవిద్యాశంకరభగవత్పాదసన్యాసస్వీకారప్రస్తావన ప్రధానముగాఁ గల్గియున్నది. ఇందు మొదటి ముప్పదియైదు శ్లోకములును

శంకరుని లోకోత్తరప్రజ్ఞను లోకమునకు వెల్లడిచేయుతలంపునఁ గల్పింపఁబడినవి. ఇందు దెలియవచ్చెడి యతిశయ మేమన— స్వగృహమునకు నదీప్రవాహానయనము, కేరలదేశీయరాజునకు సంతానవరప్రదానమును. ఇచట నిరువదియైదవశ్లోక మిట్లు పరగుచున్నది—

"తేన పృష్టకుశలః క్షితిపాలః స్వేన సృష్ట మథ శాత్రవకాలః
హాటకాయుతసమర్పణపూర్వం నాటకత్రయ మవోచ దపూర్వమ్"

ఇం దుదాహరింపఁబడిన నాటకత్రయ మెద్దియో యొకింతయుఁ బ్రాచీన శంకరజయముగాని, ప్రకృతపు సంక్షేపజయముగాని వ్యాఖ్యాతలుగాని మరియెవ్వరుగాని యెందును విన్నట్లుగాని కనినట్లుగాని తెలియదు.

౭. ఇఁక ముప్పదియారవ శ్లోకము మొదలు ఎనుబదియొకటవశ్లోకము వఱకు సన్యాసస్వీకారవిషయవిశేషవర్ణనము దెలియవచ్చెడి. అందు—

"అథ జాతు దిదృక్షవః కలా మవతీర్ణం మునయః పురద్విషమ్
ఉపమన్యుదధీచిగౌతమత్రితలాగస్త్యముఖాః సమాయయుః"

అనునది మొదటిది.

"ఇత్థం సుధీః స నిరవగ్రహమాతృలక్ష్మ్యా
శానుగ్రహో ఘటజబోధితభావివేదీ
ఏకాన్తతో విగతభోగ్యపదార్థతృష్ణః
కృష్ణే ప్రతీచి నిరతో నిరగా న్నిశాన్తాత్"

అనుశ్లోకముతుదిది. ఈనకుమనుండు శ్లోకములరచనావిశేషపు టతిశయ మా శ్రుతిస్మృతిసదాచారప్రమాణములే గమనింపవలయును. ఇందుఁ దెలియవచ్చెడి ప్రధానవిశేషము లెవ్వి యన—

౧. అగస్త్యాదులు శంకరుని సన్యాసమును గ్రహింపవలయు నని ప్రబోధించుట.

౨. సన్యసించుటకుఁ దనకుఁ బుష్కలాభిప్రాయ మున్నను దల్లియొక్క యాజ్ఞావసర మున్నటులను నద్దానిఁ గొననిదే సన్యాసమునకుఁ బ్రయోజనము లేనట్లును శంకరుఁడు చింతించుట.

3. అట్టి యాజ్ఞ లభించుట దుష్కరముగావున నద్దాని నెద్దియో యొకతీరున సంపాదింప జలచరముచేఁ జిక్కువడుటయు, నద్దానినుండి విముక్తిఁ జెంద సన్యాసగ్రహణముఁ దక్క వేరొండు సాధనము లేమికిం దల్లి తప్పక యనుజ్ఞ నీయవలయు నను వ్యాజమును గల్పించుట.

౪. సంన్యాసముఁ జేకొనినను దల్లి తనమృతసంస్కారములను శంకరుఁడే చేసితీరవలయునని నిరోధింప నట్టి నిరోధమున కియ్యకొని యట్టికాల మును దెలిసికొని తప్పక వచ్చి మృతసంస్కారము చేసెద నని ప్రతిజ్ఞఁ జేయుట.

౫. తల్లియొక్క సౌకర్యమునకు దూరమున నుండెడి నదిని తనయింటి కడకు రప్పించి స్థిరతఁ గనునట్లుఁ జేయుటయేకాక, తల్లికిఁ దగుసదుపాయముల నన్నిటినిఁ జక్కపరచినట్లును మనోహరముగ వర్ణింపఁబడి యున్నది.

☞ సన్యాసవిధాయకశ్రుతులనుగాని స్మృతులనుగాని సామాన్య దృష్టిచేఁ జూచినను పై విషయ మంతయు సర్వవిధముల నశాస్త్రీయ మని తెన్నఁగఁ దెలిసికొనవచ్చును. సన్యాసవిధాయక శాస్త్ర మంతయు— "బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్। గృహీభూత్వా వనీ భవేత్। వనీ భూత్వా ప్రవ్రజేత్। యది వేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్ గృహాద్వా వనాద్వా యదహరేవ విరజే త్తదహరేవ ప్రవ్రజేత్" అను శ్రుతి నిదానముగా గల్గియున్నది. సన్యాసవిధాయక శాస్త్రమం దెచ్చటను దల్లియొక్క యాజ్ఞయొక్క యావశ్యకతగాని తల్లియొక్క మనోభీష్టనిర్వాహముగాని తల్లికి మృతసంస్కారముగాని చేయవలయు ననిగాని చేసినచోఁ బ్రత్యవాయము లే దనిగాని విన వచ్చుటలేదు, స్మరింపఁబడుటలేదు. శంకరావతారకాలమునకు సాంఖ్య యోగ జైన బౌద్ధాది కుమతములు చెలరేగి స్త్రీపురుషవిచక్షత జాతికుల విచక్షత గాని యించుకేనియు లేకుండ ముండితముండులును గాషాయాంబర ధారులు నగు స్త్రీపురుషులు సిగ్గులెగ్గులు విడనాడి యథేచ్ఛముగ సంచరించుచు వైదికధర్మము తచ్ఛిరోవతంసమగు వైదికసన్యాస మబ్బురమై లుప్తప్రాయమై యుండ నట్టి వైదికధర్మము నుద్ధరించి సంస్థాపన జేయ మూర్తీభవించిన పరమహంస పరివ్రాజకాచార్య వర్యుఁడో యని యాచంద్రతారకమగు యశంబుతో నొప్పియుండు మహామహుని సన్యాస స్వీకారవిశేషము నిట్లు సర్దించుటకన్న ధర్మవిఘ్నకారణముండదు.

ఏలనన మాతాసత్యమునకై బాలురకు సన్యాసివేషము వేయించి యట్టి బాలసన్యాసులను మఠాధిపతులుగఁ జేసి యాడించుచు మతప్రచారమును మఠస్థులు నిజేచ్ఛగఁ జేయుట బౌద్ధమతసులతో బయలు వెడలినది. అందుకు దార్కాణమీనదుమ టిబెతులో నేర్పరుపఁబడియున్న డేలియాలామాయే

ఈ డేలియాలామా యయిదవ వత్సరమున సన్యాస వేషము వేయిం పఁబడి పట్టాభిషేకము జేయఁబడిన ట్లెల్లరకును దెలిసిన విషయమే. ప్రస్తుత మా బాలసన్యాసి కింకను పది వత్సరములు గూడ లే వను విషయము నిశ్చయమే. బాలసన్యాసులను మఠాధిపతులను జేయుబౌద్ధాచారమును బ్రచ్ఛన్నబౌద్ధులగు మధ్వులు చేకొని యుడిపి సంప్రదాయములో నున్న ఎనిమిది మఠములలో బ్రహ్మచారిసన్యాసులే అధికారులుగ నుండవలయు నను నియమమును బెట్టి యట్టి నియమమును బాటించుటకుఁ బ్రతిమఠములోను యిరువు రిరువురు చొప్పున ఉపనయన మయిన వెంటనే యత్యాశ్రమము లిచ్చి పెంచుట సంప్రదాయమై యున్నది. ఇట్టి యాచారమునుబట్టి ఎనిమిది సంవత్సరములు మొదలు పదునైదు సంవత్సరముల మధ్యవయస్సులో నున్న బ్రహ్మచారిసన్యాసులు పదునార్గురువఱకు నీమఠములలో నున్నట్లు మనము వెళ్ళినచో చూడగలము. ఇట్టి బ్రహ్మచారి సన్యాసు లుడిపిమఠములలో బ్రయోజనకారు లగుటం జూచి శృంగేరీమఠము నాక్రమించుకొనిన ములికినాటి బ్రాహ్మణాధములచ్చట పవిత్రతమంబుగ నభివృద్ధి నొందుచుండిన భారతీసంప్రదాయమును మట్టిలోఁ గలిపి శృంగేరీమఠమునుగూడ యుడిపిమఠములట్లు బ్రహ్మచారిసన్యాసులకు నిలయముగాఁ జేసి యపూర్వనియమములఁ గొన్నిటిని కల్పించి యుండుటయేకాక సమయోచితముగఁ గ్రొత్త క్రొత్త నియమములఁ గల్పించుచు నట్టివిశేషంబులకు నపూర్వములగు యుక్తిప్రయుక్తులను గల్పించుచు వైదికలోకమును వంచించుచున్నారలు. అట్టి నియమములు ప్రకృతమున నమలులోకి వచ్చినవాటిని దిఙ్మాత్రముగఁ బ్రదర్శించుచున్నారము—

౧. బ్రహ్మచారిసన్న్యాసియే శృంగేరీమఠాధిపతిగ నుండవలయును.
౨. అట్టివాడు తైత్తిరీయశాఖకుఁ జెందినవాఁడే యై యుండవలయును.
3. అట్టివాడు ములికినాటివాఁడే కావలయునుగాని వేరొకఁడు గా గూడదు.
౪. అట్టిబ్రహ్మచారిసన్న్యాసికి సన్న్యాసవేషమాత్రముచేతనే సర్వాధికారము లభించును. ప్రత్యేకముగా సన్న్యాసాశ్రమప్రయుక్తములగు నుపదేశాదికములతో నెంతమాత్రముఁ బని లేదు.
౫. అట్టిబ్రహ్మచారిసన్న్యాసి సన్న్యాసస్వీకారము మొదలు దల్లియొక్క యాజ్ఞకు నధీనుఁడై యామెమరణమునఱకు నామెను బోషించుచు మర్యాదలను బాలించుచు నామెకు మృతసంస్కారములనుగూడ జేయవచ్చునను నియమముగూడ నుండు నని తోఁచెడిని.
౬. తల్లితోఁబాటు తండ్రిగూడ యుండినచోఁ దండ్రికిఁగూడ సర్వవిధముల యథావకాశము మర్యాదలు జరుగవలయునను విషయ మర్థసిద్ధమే.

ఇట్లెన్నియో గమనించినకొలది బయలువెడలును. గ్రంథవిస్తరభీతిచే నవ్విప్రస్తావననుండి విరమించుచున్నారము.

పూర్వాపర సందర్భములను బ్రస్తుతమున శృంగేరియందు జరుగుచుండెడి వ్యవహార విశేషములను గమనించినచో శృంగేరీమఠము నాక్రమించుకొనిన ములికినాటి దుండగీడులు దమదుండగములకు లోకమును వంచించి గతినిఁ గల్పించుకొనఁ జిత్రింపజేసిన యీ నలుబదియారు శ్లోకములని మీమాంసికులు గ్రహింపఁగలరు.

ఇట్లు శృంగేరీమఠమువారు తమదుర్న్యాయదుష్ప్రచారములను శిష్టాచరణములట్లు లోకులను భ్రమింపఁజేసి మాన్యతను గనుచుండఁ గ్రమక్రమముగాఁ బుష్పగిరిమఠమువారును, హంపిమఠమువారును, శివగంగ అమనిమఠములవారును దమతమమఠములందుఁగూడ బ్రహ్మచారిసన్యాసులనే ప్రతిష్ఠించుట నములులోఁ బెట్టిరి. ఇఁక కుంభకోణపు పితలాటకమగు కామకోటిమఠమునుగూర్చి వేఱె చెప్పనక్కఱలేదు. వేయేల-వైదికధర్మరక్షకస్థానము లని బడాయీలు గొట్టుకొనుచు నిర్లజ్జముగ జరించు నీమఠము లన్నియు, బౌద్ధమఠములకంటె నికృష్టముగ బరిణమించి యున్న వనుటకుఁ గడుఁ గడు విచారమగుచున్నయది. ఇయ్యది ప్రసక్తానుప్రసక్తి. ప్రకృతమును జేకొందము.

౮. ఆఱవసర్గమున—

"సోఽన్త్యజం పథి నిరీక్ష్య చతుర్భి ర్భీషణైః శ్వభి రనుద్రుత మారాత్
గచ్ఛ దూర మితి తం నిజగాద ప్రత్యువాచ చ స శంకర మేనమ్"

అను నిరువదియైదవ శ్లోకము మొదలు—

"ఏవ మేన మనుగృహ్య కృపావా నాగమైః సహ శివోఽన్తరధత్త
విస్మితేన మనసా సహ శిష్యైః శంకరోఽపి సురసిన్ధు మయాసీత్"

అను నేబదిరెండవశ్లోకమువఱకును గల యిరువదియెనిమిది శ్లోకములచే నంత్యజవేషధారి యగు శివునకును బరివ్రాజకవేషధారి యగు శివునకును సంభాషణము జరిగినట్లు వర్ణింపఁబడియున్నది. ఇట్టి సంవాదవర్ణనము నవకాళిదాసుయొక్క నవీనకల్పనమే కాని వేరొండు గాదని యందుఁ దెలియవచ్చెడిని.

"భాస్కరాభినవగుప్తపురోగమా న్నీలకంఠగురుమండనముఖ్యాన్
పండితా నథ విజిత్య జగత్యాం ఖ్యాపయాద్వయమతే పరతత్త్వమ్"

అను నేబదవశ్లోకమువలన సువ్యక్త మగుచున్నది. ఈ శ్లోకమునందుఁ దెలియవచ్చెడి భాస్కరాభినవగుప్తులును నీలకంఠుడును శంకరులకు సమకాలికులు గాకపోవుట యటుండ శంకరులకు సన్నిహితకాలము నందుఁ గూడ నుండినవారలుగారు. వీరును శంకరసమకాలికులుగను, శంకరులతో వాదోపవాదములు సలిపినవారలుగను, వర్ణించిన నవకవిని కుకవి యనినచో దోష మెందుఁ గలదు? ప్రాయశః యీకుకవి యర్థలుబ్ధులగు పండితాధములవలన వేదాన్తములను నేరిచి బ్రహ్మవాదుల మని యభినయించుచుండెడి బ్రాహ్మణేతరులను మహామ్మదీయులను సంతసింపఁజేసి మనియుటకుగాను గల్పించిన యనృతకల్పనావిశేషము దక్క వేరొండు గాదని యపశూద్రాధికరణమును బృహదారణ్యక భాష్యమున వివరింపఁబడిన యంత్యజులస్థితి గుర్తెరింగినవా డిట్టి కల్పన మున కించుకేనియు సాహసింపఁడు. లేదా యొకవేళ వైష్ణవులచే నెల కొల్పఁబడిన పన్నిద్దరాళ్వారులకును శైవులయొక్క యరువదిమువ్వురు శైవభక్తులకును గతి గల్పించి వైష్ణవులవలనను, శైవులవలనను, స్వాభీష్టములను దీర్చికొన నీ కల్పనకుఁ బాల్పడిన ట్లూహింపవచ్చును. ఇట్టి యుద్దేశముచేత ననియే యీమధ్య నొక ధర్మప్రబోధకుఁడు సన్న్యాస ప్రస్తావమున నొకింత వ్రాసియున్నట్లు మనము నిశ్చయింపవచ్చును. అదెట్లనిన:—

"విద్వత్సన్న్యాస మనునది సర్వవర్ణసాధారణము, సర్వజాతిసాధారణము, నని యంగీకరింపక తప్పదు. ఏలయనగ ప్రాక్తనజన్మలలోని కర్మవిభేద

ములనుబట్టి శుద్ధచిత్తులై శ్రవణాదులవలన జ్ఞానసిద్ధి కలిగి బ్రహ్మసాక్షాత్కారము నొంది యజ్ఞానాంశ మగు నావరణశక్తి నశించినను విక్షేపశక్తిబలము మిగిలినపుడు కొన్ని జన్మలను బొందుట కవకాశ మున్నందున ఆజన్మలు శూద్రాదిజన్మ లైనను వారు జ్ఞానముకలవారై యుండుటచే విద్వత్సన్న్యాసు లన దగి యుందురు. కనుక నిది చాతుర్వర్ణ్యసాధారణ మని గ్రహింపనగును. ఇది నాలుగువర్ణములకేగాక నితరజాతులవారికిఁ గూడఁ జెల్లు నని యూహింపవచ్చును. పురాణప్రసిద్ధు లగు జడ భరతాదు లిందుకుఁ దార్కాణము. ఈ యభిప్రాయముతోడనే మనీషా పంచకములో "చండాలోఽస్తు స చ ద్విజోఽస్తు గురు రిత్యేషా మనీషా మమ" అని శ్రీమచ్ఛంకరభగవత్పాదులు మన కుపదేశించియున్నారు. విశిష్టాద్వైతమతావలంబులు ఈయభిప్రాయముతోడనే పన్నిద్దరాళ్వారులను తమప్రధానదేవాలయములలో నారాధ్యులుగ ప్రతిష్ఠాపన చేయుచున్నారు. వారిని ప్రతిష్ఠింపనిచో నాదేవాలయమును దివ్యక్షేత్రముగ నంగీకరింపక అందు తీర్థప్రసాదాదిస్వీకారమున కిచ్చగింపరు. పన్నిద్దరాళ్వారులలోఁ గొందఱు చాతుర్వర్ణ్యములలోఁ జేరనివా రున్నటుల నెల్లరకుఁ దెలిసినయంశమే. కావున విద్వత్సన్న్యాసము సర్వజాతిసాధారణ మనికూడ నిశ్చయింపవచ్చును".

☞ ఇట్టి ధర్మప్రబోధమునందలి యనౌచిత్యాసందర్భప్రసంగముల నిట విమర్శించి ప్రదర్శించుటచే గ్రంథవిస్తరమగుటయేగాక ప్రయోజన మించుకేనియు లేకపోవుటచే "ప్రయోజన మనుద్దిశ్య న మన్దోఽపి ప్రవర్తతే" యను నభియుక్తోక్తి మీఱరనట్టి విమర్శన మిచట నుపేక్షింపఁ బడుచున్నది.

౯. ఏడవసర్గమున—

"స జాతు శారీరకసూత్రభాష్య మధ్యాపయ న్నభ్రసరిత్సమీపే"
యను మొదటి శ్లోకము మొదలు—

"......ద్వైపాయనః సో న్తరధా ద్యతాత్మా"
అను చరణమ న్తముగా గలిగిన యేబదియెనిమిది శ్లోకములును వ్యాస శంకరసంవాద ప్రసంగముతో నొప్పుచున్నవి. ఇందు పదునొకండవ శ్లోకము పద్మపాదాచార్యులచే వ్యాసశంకరు లిట్లు స్తవముచేయఁ బడి నట్లు నిర్వచింపఁబడినది.

"త్వం శంకరః శంకర ఏవ సాక్షా ద్వ్యాసస్తు నారాయణ ఏవ నూనమ్
తయో ర్వివాదే సతతం ప్రసక్తే కిం కింకరోహం కరవాణి సద్యః"

ఈ యేబదియెనిమిది శ్లోకములకంటె మృషాకల్పనము వేరొండు దెలియ రాదు. ఇందలి మృషాత్వ మాధికారికాధికరణమునందుఁ దెలియవచ్చెడి యీాదిగువభాష్యపు పంక్తులవలన ప్రాజ్ఞులు గ్రహింపఁగలరు. అవెవ్వి యన—

"తథా హ్యపా న్తరతమా నామ వేదాచార్యః పురాణర్షిః విష్ణు నియోగా త్కలిద్వాపరయో స్సంధౌ కృష్ణద్వైపాయనః సంబభూవేతి స్మర న్తి"

కృష్ణద్వైపాయనుఁడు కలిద్వాపరములయొక్క సంధియం దుండినటు స్మరించుచున్నార లని యుపదేశించు శంకరులు—కుకవి

"దినాష్టకం వాక్కలహో జజృమ్భే"

యని వర్ణించినవిషయమును మఱచెనుగాబోలు. ఈనవీనకాలిదాసు యొక్క యన్ృతకల్పనలకు హద్దు లే దని చెప్పవచ్చును. వేయేల— యీకవి సూత్రభాష్యములయొక్క వా స్తవనామములనుగూడ గుర్తెరుంగనంతటి యవివేకి యని—"శారీరకసూత్రభాష్య మధ్యాసయ" న్నను పదప్రయోగమువలన సువ్యక్త మగుచున్నది.

౧౦. ఏడవసర్గమున—

"నిరాస్థ మీశం శ్రుతిలోకసిద్ధం శ్రుతేః స్వతోమాత్వ ముదాహరిష్య" న్నను నెనుబదితొమ్మిదవ శ్లోకము మొదలు—

"ద్రోహద్వయ స్యాస్య చికీర్షు ర ద్యా
న్యథోదితాం నిష్కృతి మాశ్రయా"

మ్మను శ్లోకమువఱకును గల పదునాలుగు శ్లోకములచేఁ గుమారిలభట్టు దనకు ఘటించిన యీశ్వరనిరాస గురుద్రోహము లనెడి పాపములకుఁ బ్రాయశ్చిత్తముగాఁ దుషాగ్ని ప్రవేశమును జేసికొనుచున్నట్లుఁ సల్కినట్లువర్ణింపఁబడినది. ఇచట గురుద్రోహ మనఁ దనకు గురు వగు సుగతునియెడ గావించిన ద్రోహమని—

"త దేవ మిత్థం సుగతా దధీత్య ప్రఘాతయం తత్కుల మేవపూర్వ" మ్మను నూటయొకటవ శ్లోకమువలనఁ దెలియవచ్చుచున్నది. ఈశ్వర నిరాస విషయ మీ శ్లోకశేషమువలననే—

"జైమిన్యుపజ్ఞే ఽభినివిష్టచేతాః శాస్త్రే నిరాస్థం పరమేశ్వరంచ"
అనినిర్వచింపఁబడియున్నది. సుగతుడనువాఁడు వేదవ్యాసునికంటెఁ బూర్వ

మున్నట్లు బ్రహ్మసూత్రములవలన మన మూహింపవచ్చును. అట్టి సుగతునకును కుమారిలభట్టునకును శంకరులకును సమకాలవర్తిత్వముగాని సన్నిహితకాలవర్తిత్వముగాని యెట్లు సంభవించఁగలదో కాలనిర్ణయకోవిదులు గమనింతురుగాక !

సుగతకులద్రోహ మన నీ నవీనకవిచే మొదటిసర్గమున— "అథేన్ద్రో నృపతి ర్ఖ్యాత్వా ప్రజాధర్మేణ పాలయ" న్నను నేఁబదియెనిమిదవశ్లోకము మొదలు తొంబదితొమ్మిదవసర్గాంత్యశ్లోకమువఱకుఁ గల నలువది శ్లోకములచే వర్ణింపఁబడిన కుమారిలదిగ్విజయమే. దిగ్విజయమును ద్రోహమని కుమారిలభట్టెటులఁ దలంచెనో యద్దాని నీ కుకవియే గుర్తెఱుంగవలయును. ఈకవికి వాస్తవముచేఁ బూర్వోత్తరమీమాంసములజ్ఞాన మించుకేనియు లే దని చెప్పవచ్చును. లేనిచో నిట్టి సత్యేతరకల్పనములఁ జేయుటకు సాహసించి యుండడు. తుషాగ్నిదహనమన్న కార్మికులదృష్టిలో నుత్తమోత్తమ మగు కర్మవిశేషముగా భాసించుచుండు నను విషయము నీ కుకవి విని యుండకపోవుటయ యిట్టి కుకల్పనకుఁ గారణము. గ్రంథవిస్తరభీతిచే నద్దాని నిట విరమించుచున్నారము.

౧౧. ఎనిమిది తొమ్మిది పదియవ సర్గములు మూఁడు నీ నవకవియొక్క మృషాకల్పనముతో సర్వవిధముల నొప్పారుచు సత్యేతరములును నశ్లీలములును శాస్త్రదూష్యములు నగుప్రసంగముల కాకరమ్మై యున్నవి. అందు నెనిమిదవ సర్గము శ్రీశంకరమండనమిశ్రులసంవాదరూపముగఁ గల్పింపఁబడియున్నది. ఇందుఁ దెలియవచ్చెడి యభూతకల్పనావిశేషములలో నగ్రగణ్యము వ్యాసజైమినులయొక్క శ్రాద్ధభోక్తృత్వము.

అయ్యది పంద్రెండవ, పదమూడవ శ్లోకములం దిట్లు వర్ణింపఁబడి యున్నది—

"తపోమహిమ్నైవ తపోనిధానం స జైమినిం సత్యవతీతనూజం
యథావిధి శ్రాద్ధవిధౌ నిమన్త్ర్య తత్పాదపద్మా న్యవనేజయ న్స్వయమ్"
"తత్రాన్తరిక్షా దవతీర్య యోగివర్యః సమాగమ్య యథార్హ మేషః
ద్వైపాయనం జైమిని మ ప్యుభాభ్యాం తాభ్యాం సహాగ్రం ప్రతినన్దితో
భూత్"

ప్రాయశః యీకవి యర్థలుబ్ధత మీఱ శ్రాద్ధభోక్తృత్వమునకు సంసిద్ధు లగు పండితంమన్యులకును సన్న్యాసులకును గలి కల్పింప వ్యాసజైమినుల నిటకు శ్రాద్ధభోజనమునకు దించె ననిన యెుకి వింత గాదు. వ్యాస జైమినులు కలిద్వాపరసంధియందుఁ జరించినట్లు పురాణప్రసిద్ధమేకద. ప్రకృతము వారలు మన యిచ్చ వచ్చినటుల వాదములకును భోజనము లకును సంసిద్ధులైనచో నీ శంకరజయమునకుగాని, యిందలి జయ ప్రసంగములకుగాని, వాదోపవాదములకుగాని, యనసరమేయుండ దను విశేషము నీకవి దిలకింపలేదుగాఁబోలు పాపము! కాని యందు సంవాదమాత్రముచేఁ జరితార్థము నొందించిన వ్యాసశంకరుల కిచట శ్రాద్ధవిశేషమున సహభోజనగౌరవమునుగూడ నీ కవి లభింపఁజేసెను. ఆహాహా కవిత్వమహిమ !

౧౨. ఇఁక నీ యెనిమిదవసర్గమున పదునారవశ్లోకము మొదలు ముప్పదిరెండవశ్లోకమువఱకుఁ గల పదునేడు శ్లోకములచే శంకరమండన మిశ్రులకు జరగినట్లు నత్యంతవిరస మగు కల్పన సేయఁబడియున్నది.

అయ్యది చాలవఱకు వ్యాసజైమినులు వినోదముతో వినుచుండినట్లును బిమ్మట వ్యాసు లొకింత మండనునకు బుద్ధిఁ జెప్ప మండనుఁడు భిక్షా వందనముఁ జేసినట్లును వర్ణింపఁబడియె. పాప మచటికి కవి వ్యాసజైమినుల రప్పింపకపోయినచో శంకరులకు భిక్షావందనమునకు మారుగ నర్ధచంద్రప్రహారము లభించి యుత్తరగ్రంథకల్పమునకుఁ దావు లేకుండు నేమో. పాపము మండను డా క్షణమునఱకును శంకరునిఁగూర్చి యొకింతయైన విని యుండక అప్పుడే చూచియుండెనేమో! చూచినను శ్రుతిస్మృతిసదాచారములను మఱచి భిక్షావన్దనమును మాని నిందకుఁ గడంగియున్నట్లు కవికల్పనము మృషాకల్పనమే కాని వేరొండుగానేరదు.

౧౩. ఏతద్విషయ మిట్లు పరగుచుండ నేబదిరెండవశ్లోకము మొదలు మూఁడుశ్లోకములుగూడ మృషాకల్పన మని వేఱ వచింపనక్కఱలేదు.

౧౪. పై శ్లోకములతోఁబాటు అరువదితొమ్మిదవశ్లోకకల్పనమును.

౧౫. ఇంతియకాదు— సర్గాంత్యశ్లోకములు—

"కోపాతిరేకవశతః శపతా పురా మాం"

అను నూటముప్పదవ శ్లోకము మొదలు నాలుగు శ్లోకములుగూడ సర్వవిధముల మృషాకల్పనమే. ఇందలి యనౌచిత్యమును వెలిబుచ్చుట విరసముగా నుండుగావున నుపేక్షింపఁబడుచున్నది.

౧౬. తొమ్మిదవసర్గము—

శ్రీశంకరభారతులసంవాదప్రసంగవర్ణనముగాఁ గల్పింపఁబడియున్నది. ఈ సర్గ మంతయు మృషాకల్పనమే. ఇందుఁ దెలియవచ్చెడి సూనృతోక్తి

యొక్కటియును లేదు. ఇందు — మొట్టమొదటఁ గొంత సంవాదము కల్పింపఁబడి మండనుఁడు పరాభవము నొందింపఁబడినట్లు సువ్యక్తమైనను మండనుఁడు దన పరాభవమును జైమినిముఖమున విని యానందింప వలయు నని జైమినిని స్మరించి విని యానందించినట్లు పదునేడవశ్లోకము మొదలు యిరువదిమూడవశ్లోకమువఱకు వర్ణింపఁబడియున్నది. ఏతద్విష యము శ్రాద్ధభోజనకాలముననే యొకింత జైమిని తేటపరచిన-చో బాగుం డెడిది. ఇట్టి మృషాకల్పనలవలన ధర్మప్రతిష్ఠాపనాధికారపురుషు లగు వ్యాసజైమినులకుఁ గూడఁ దుచ్ఛములగు మాయావంచనకుహాకత్వాదుల నాపాదించిన మహాపాతకమున కీ కవి యొడిగట్టుకొని యుండె నని గ్రహించలేదుగాబోలు.

౧౭. ఇచట —

"అపి తు త్వయాఽద్య న సమగ్రజితః"

అను నేబదియారవశ్లోకము మొదలు మూడుశ్లోకములచే భారతి శంకరు లను వాదమునకుఁ బిలిచినట్లు వర్ణింపఁబడియున్నది. ఎనిమిదవసర్గము యొక్క నూటముప్పదినాలవశ్లోకమున శంకరు లామెతో వాదము చేయ బంధించినట్లు —

"బబన్ధ నిశ్శంక మరణ్యదుర్గామన్త్రేణ తాం జేతుమనా మునీంద్రః"

అని వర్ణింపఁబడియున్నది. ఈ రెండుకల్పనలకుఁ గల సందర్భవిశేషము మీమాంసికులు గమనింతురుగాక! వాస్తవమున శంకరవిజయము మండనపరాభవము భారతీనిజధామగమనమును నెనిమిదవసర్గముయొక్క నూటముప్పదియవ శ్లోకముచేఁ బూర్తిగాఁగ పదియవసర్గమున —

" సంన్యాసగృహ్యావిధినా సకలాని కర్మాణి ".

యను శ్లోకము మొదలుగాఁ గల్గిన యుత్తరగ్రంథమున వర్ణింపఁబడిన కథా శేషము యథోచిత మని చెప్పనచ్చును. కాని యెనిమిదవసర్గమునందలి నూటముప్పదవశ్లోకమునకుఁబరమందుఁ దెలియవచ్చెడి యారు శ్లోకము లును, తొమ్మిది పది సర్గములును సర్వవిధములఁ గవియొక్క తుచ్ఛ ప్రకల్పనములే కాని యం దెంతమాత్రమును సత్యము లే దను విషయ మును శ్రుతిస్మృతి సదాచారకోవిదులు గుర్తింపఁగలరు. ఈ రెండు సర్గము లందును గల్పింపఁబడిన విషయములు శంకరభారతీసంవాదము, శంకరపరాభవము, కుసుమాస్త్రశాస్త్రాధీతిబోధాచరణలకు మాసమాత్రా వధియాచ్న, భారతియొక్క సమ్మతి, అమరుకశరీరప్రవేశము, తన్నిర్గమ నము, నృసింహాస్తవము, భారతీపరాభవాన్తర్ధానములును. ఏతద్వృత్తా న్తవర్ణన మతీవవిశేషయుక్త మని యజ్ఞతచే స్తవము చేయఁబడుచుం డుట యొక వింత గాదు. ఈవర్ణనములందలి యనౌచిత్యాసభ్యతలు శాస్త్రదూష్యత లోనుగాఁగలవిషయములఁ బ్రదర్శింప యత్నించుట యెంతయు సహ్యముగా నుండుట కవకాశము లేమి విరమించఁబడు చున్నవి. ఈ కల్పనముయొక్క మృషాత్వము దేటతెల్లము గాగ రెండు దోషములనుమాత్రము దిఙ్మాత్రముగఁ బ్రదర్శించుచున్నారము.

అందు మొదటిది యమరుకజీవితము. ఈ పేరు గలవాడుగాని యిట్టి స్త్రీసంపదతో నొప్పువాడుగాని యాకాలమున నెవ్వం డేని యొక రా జుండె ననుటకు నిదర్శనము లెవ్వియేని వినఁ గన నగునా? అమరునకు—

"సౌన్దర్యసౌభాగ్యనికేతసీమాః పరఃశతా యస్య పయోరుహాక్ష్యః"

యని శతాధికలగు భార్య లుండియున్నట్లు వర్ణింపఁబడినది. ఇట్టి స్థితి కెట్టి యవకాశముండి యుండవలయును? అట్టి యవకాశ మక్కాలపు రాజున కెవ్వనికైన గలదా యనినచో నట్టి రాజు వంధ్యాసుతుఁడే యగును.

ఇఁక రెండవది— ఒకవేళ నమరుకుఁ డుండి యున్నాఁ డనుకొనియెదము. అమరకుఁడు వాస్తవముచేఁ జచ్చిన ట్లెల్లరకును దెలిసినవిషయమేకద. అమరుకదేహమున శంకరుఁడే చొచ్చుఁగాక, విష్ణువే చొచ్చుఁగాక, అక్కడ నిలిచియుండిన యాతనిభార్యలపుడేమి కావలయును? సువాసినులా లేక విధవలా? ఏది యెట్లు లయ్యెను పరదారగమనదోషము సిద్ధమేకద. అమరకుఁడు చచ్చినచోఁ బై పెచ్చు విధవాగమన దోషము, అజ్ఞాత లగు నబలలను మాయోపాయముచేఁ జెఱచిన మహాదోషమును దప్ప వని చెప్పి తీరవలయును. ఇంతకంటె నెక్కుడుగ నిచట వ్రాయుట యనుచితమేకాక అశ్లీలాదిదోషయుక్తము గావున విరమించఁబడుచున్నది. పాపము శాంతించుఁగాక. ఈ తొమ్మిది పదియవ సర్గములు చదువుట గాని వినుటగాని శ్రేయస్కాముల కెంతమాత్ర మువితము గా దని శాసించుచున్నారము.

౧౧. పదునొకండవ సర్గము—

ఉగ్రభైరవనిర్జయ మనుపేర పదునొకండవ సర్గము గల్పింపఁబడియున్న యది. ఇట్టి కల్పనాకౌశలమువలన వక్తలకును శ్రోతలకును గలుగు ప్రయోజన మెద్దియును గానరాదు. ఇట్టి ప్రయోజనము బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థుల కెవ్వరికి నిందుఁ దెలియరాదు. ప్రాయశః సన్న్యాసుల కెద్దియేని ప్రయోజనము నీ కవి యుద్దేశించియుండవచ్చు. అట్టి ప్రయోజన మేమై యుండవచ్చుననన— ప్రాయశః శృంగగిరి మొదలుగా

గల మతములందుఁ బొట్టకూటికై మాయోపాయములఁ బన్నుచుఁ జరించు చుండఁగీడు లోకస్థు డట నున్న కృతకయతి దమకు బాధ యని యెంచినచో నాతని స్థానమునఁ దమ కనుగుణ వేఱొకనినిఁ బ్రవేశపెట్టు నిశ్చయమున నట నున్నవాని హఠాత్తుగ జీవసమాధియందుఁ బ్రవేశపెట్టుటయో, లేదా వానిచే విషపానముఁ జేయించుటయో, లేక ఉద్బంధముఁ గావించుటయో, లేక వేరొక విధమున బలివేయుటయో, యొక వింత యెంతమాత్రమును గాదు. మఠములందలి మఠాధిపతులయొక్క ప్రవేశనిర్గమన విధానముల నొకింత విచారించువారికీ విషయము నిశ్చయముగఁ దెలియఁగలదు. అట్టి పరిస్థితులలో దనకు నాసన్నమై యుండెడు దురవస్థను గుర్తెరింగి యట్టి యవస్థనుండి తప్పించుకొనుట కవకాశము లేని పరివ్రాజకబ్రువున కొకింత ధైర్యమును గలుగఁజేయ నీ సర్గము ప్రయోజనముఁ గనినఁ గనవచ్చును. ఇంతకంటె వేరు ప్రయోజనము నీ పదునొకండవ సర్గము పడయు నేర దని కోవిదులు దెలిసికొనఁ గలరు.

౧౩. పదమూఁడవసర్గమున—

బ్రహ్మవిద్యాప్రచారమనుపేరవార్తికాస్త్రప్రవర్తనమనుపేర శ్రీశంకరులచే గ్రంథముల వ్రాయించినట్లును, భవిష్యత్తుప రాబోవు గ్రంథమునకై బాల్యముననే విరతిఁ జెంది యుత్తమగురువు కడ బ్రహ్మవిద్య నకలంకముగ నేర్చి కృతకృత్యుఁ డై నట్టియు సనందనావతారముగా వర్ణింపఁబడినట్టి పద్మపాదులకు పునః గర్భనరకదుఃఖమును గార్హస్థ్యపఙ్క్తిమగ్నతను విధించుచు భాష్యటీకను రచించునట్లు నిట్లు—

"ప్రారబ్ధకర్మపరిపాకవశా త్వమన స్త్వం
వాచస్పతిత్వ మధిగమ్య వసుంధరాయామ్"

నిర్వచించినట్లు వర్ణింపఁబడియున్నది—ఆహాహా ఏమి కల్పనాచతురత!

౨౦. ఇఁక నీ పదమూఁడవసర్గపుసరణిం జూడ శ్రీశంకరశిష్యు లన్యోన్య మీర్ష్యాసూయలతో వైషమ్యములఁ జెందియుండుటయేగాక సురేశ్వరు నందు నందరును విపులమగు నసూయను జెందియున్నటుల వ్యక్త మగుచున్నది.

శ్రీవిద్యాశంకరభగవత్పాదులు వైదికధర్మసంస్థాపనకై భారతభూమి యందుఁ గల యేకలులగు రాజుల నందరను దమపాండిత్యవైభవముచే శిష్యులుగఁ జేసికొని వారలచే ధర్మపరిపాలనముఁ జేయింప వారివారి రాజధానులయందు రాజగురుమఠముల నేర్పరచి యందు నియమింపఁ బడిన రాజగురువులు దమకు సన్నిహితు లగు పీఠాధిపతులవలన నుప దేశింపఁబడునట్లు ద్వారకయందును బదరికాశ్రమమందును శ్రీజగన్నా థంబునను మూఁడు మఠములను గ్రమముగా నేర్పరచి యందు హస్తామలక తోటక పద్మపాదులఁ బ్రత్యేకప్రత్యేకముగా నధిపతులుగనేర్పరచి, వారల ముప్వురతోఁబాటు రాజగురువులుగూడ సురేశ్వరుని యాజ్ఞానువర్తులై సర్వవిధములఁ జరించుచుండునటుల నియమించి సురేశ్వరులను భారత వర్షమున భారతీవంశసార్వభౌమునిగ నెలకొలిపి పరమహంససామ్రా జ్యము నఖండతేజముతో నెలకొలిపిన శ్రీభగవత్పాదులకును వారి యుత్తమశిష్యులకును నన్యోన్యవైషమ్యకుహాకత్వాదుల వర్ణించిన కవి కల్పనము నేమనవలయును? ప్రాయశః యీకవియొక్క యాశయముఁ

పీఠాధిపత్య మన నెద్దియో యొకతీరున బాలబ్రహ్మచారికి సన్యాసివేష మును వేయించి యట్టి కృతకసన్యాసిచే దేవలకునిచేవలె పీఠదేవతార్చన మును జేయించుట యై యుండవలయును. ఆహాహా యేమి యద్భుత కల్పనము !

౨౧. పదునాలవసర్గమున—

"ప్రస్థాప్య తం గురువరోఽథ సురేశ్వరాద్యైః
కాలం కియన్త మనయ త్సహ శృఙ్గకుఙ్గ్రే"

యను నిరువదియొనిమిదవశ్లోకము మొదలు—

"ఇతి స్వజననీ మసౌ మునిజనై రపి ప్రార్థితాం"

అను నేబదినాలుగవశ్లోకమువఱకును గల యిరువదియేడు శ్లోకములచేఁ జేయఁబడిన మాతృపునర్దర్శనము, మాతృవందనము, కర్తవ్యాంశప్రార్థనము, బ్రహ్మోపదేశము, తన్నిరర్థకత, శివదూతలరాక, వారలయొక్క నిష్ప్రయోజనత్వము, విష్ణుదూతలయొక్క రాక, వారలచే విమానమున నుంచఁబడిన తల్లి యర్చిరాదిమార్గమున పరంపదమును బొందుటయుఁ గ్రమముగా వర్ణింపఁబడి నలువదియాఱవశ్లోకమున శంకరకృత్య మిట్లు వర్ణింపఁబడియున్నది—

"స్వయ మేవ చికీర్షు రేష మాతు శ్చరమం కర్మ సమాజుహావ బంధూన్
కి మిహాస్తి యతే తవాధికారః కితవే త్యేన మమీ నినిన్దు రుచ్చైః"
అని ఇట్లు ప్రశ్నించిన బంధువులకును శంకరులకును మధ్య జరిగిన

వృత్తాంతము నలువదియెనిమిది, నలువదితొమ్మిది, యేబదవ శ్లోకము లచే నిట్లు వర్ణింపఁబడియున్నది

"సంచింత్య కాష్ఠాని సుశుష్కవన్తి గృహోపకంఠే ధృతతోయపాత్రః
స దక్షిణే దోష్ణి మమన్థ వహ్నిం దదాహ తాం తేన చ సంయతాత్మా

న యాచితా వహ్ని మదుర్యదస్మై శశాప తాన్స్వీయజనాన్సరోషః
ఇతఃపరం వేదబహిష్కృతాస్తే ద్విజా యతీనాం న భవేచ్చ భిక్షా.

గృహోపకంఠేషు చ వః శ్మశాన మద్యప్రభృత్యస్త్వితి తాఞ్ఛశాప
అద్యాపి తద్దేశభవా న వేద మధీయతే నో యమినాం చ భిక్షా."

ఇట్టికృత్య మంతయు శ్రుతిస్మృతిసదాచారవిరుద్ధమగు దుష్కృత్య మని సర్వవిధముల నట్టిదుష్కృత్యము సమర్థింప నేబదిమూడవశ్లోకము నిట్లు కల్పించియున్నాఁడు—

"యద్యప్యశాస్త్రీయతయా విభాతి తేజస్వినాం కర్మ తథాప్యనింద్యమ్
వినింద్య కృత్యం కిల భార్గవస్య దదుః స్వపుత్రాన్కతిచిద్వృకాయ"

ఇం దొక ధర్మసూక్ష్మము ప్రాజ్ఞులు యోజింపవలసియున్నది— శ్రీవిద్యాశంకరభగవత్పాదులు సకలవేదబాహ్యమతములను పుష్కలముగ శాస్త్రయుక్త్యనుభూతులచే జయించి శ్రుతిస్మృతి సదాచార సిద్ధమగు వైదిక ధర్మములను నక్కాలమున సంస్థాపించి యయ్యది స్థిరత గనుటకు నత్యద్భుతముగఁ బరమహంస సామ్రాజ్యము నెలకొలుపుటయు నద్దానిని తిరుగ శ్రీవిద్యారణ్య మహా

శయులు సాధ్యమైనంతవరకు బునరుద్ధరణముఁ జేయుటచే నేటివఱకును వైదికధర్మ మొకింతనిలిచియుండుటకుఁ గల కారణము గద్దె నని యెల్ల రును గుర్తెరింగినవిషయమే. శ్రీ విద్యాశంకరభగవత్పాదులు ప్రస్థానత్రయము నాధారముగఁ జేకొని శ్రుతిస్మృతిసదాచార సిద్ధమగు వైదిక ధర్మము నించుకేనియు నాచరింపక పోవుట యటుండ, ధర్మదూష్యములగు నమరకశరీరప్రవేశాదికము, మృతమాతృసంస్కారము, ధర్మ జిజ్ఞాసువులకు నప్రతిహతమగు శాపప్రదానము, మొదలుగాఁగల యకృత్యంబులనే కావించి యుండినచో నేటివఱకు నామహామహుని గ్రంథములు పరమపవిత్రములుగను బరమప్రమాణములుగను దలంపఁబడుటయు నామహామహునే నేటివఱకు నెవ్వరేనియు నించుకేనియు విస్మరణము లేకుండ పూజ్యభావముతో నహర్నిశము స్మరింపుచుండుటకును నవకాశముండి యుండకపోవచ్చును. వేయేల ? శ్రుతిస్మృతిసదాచార ప్రమాణధురీణులగు సురేశ్వాచార్యాదిమహనీయు లామహామహునిఁ దమశిరస్సులయందహర్నిశము నుంచుకొనుట కీయకృత్యములే యనినచో వైదికధర్మ మానాఁడే మురిగి మురిగి శ్రీశంకరభగవత్పాదులకు నాచంద్ర తారకమగు యశంబు నిచ్చుట కవకాశము గల్గియుండదు. అప్రతిహత తేజముతో నధీతిబోధాచరణములచే ముల్లోకములకు నాదర్శకమగు పారమహంస్యమును మూర్తీభవింపఁజేసిన పవిత్రపురుషునియం దిట్టి యశ్లీలకల్పనంబులఁ గల్పించిన కుకవి యెట్టిఫలము ననుభవించుచు న్నాఁడో యాపరేతరాట్టుకే తెలియవలయును. ఏది యెట్లు లైన నేమి, కవిహృదయము చాల నిగూఢమును, కల్పనాకౌశలము పుష్కలమగు లోకవంచకత్వముతో నొప్పారుచున్న దనుటకు సందియము లేదు.

౨౨. పదునేనవసర్గము—

శ్రీవిద్యాశంకరభగవత్పాదులచేఁ జేయఁబడిన దిగ్విజయవిశేషముగా నీసర్గము కల్పింపఁబడియున్నది. ఇయ్యది సామాన్యరూపముచేఁ గవి బుద్ధికిఁ దట్టిన మతముల నెద్దియో యొకతీరున శ్రీశంకరులు ఖండించి యద్వైతము స్థాపింపఁబడినట్లు వర్ణింపఁబడినది. ఈసర్గమును గల్పించిన కవికి నించుకేనియుఁ గాలజ్ఞానము గల్గియున్నదా యని యోజింప వలసియున్నది. ఈసర్గమున నుదాహరింపఁబడియున్న మతాంతర ప్రముఖులలో నొక్కరైనను ముచ్చటకు శంకరసమకాలికులుగ నుందు రనుట దుర్లభము. ఇందు దెలియవచ్చెడి మతాంతరులపేర్ల నొకింత దిఙ్మాత్రముగఁ బ్రదర్శించెదము—

"హరదత్తసమాహ్వయోధిగమ్య సంగిరతేస్మ నీలకంఠమ్
"శివతత్త్వరసూత్రభాష్యకర్తా......" ౩౩—౫౩

"సమేతి స భట్టభాస్కరాయ"
"కుమతోత్ప్రేక్షిత వృత్తిజాలమ్". ౮౦—౮౩

"ప్రసిద్ధాన్విబుధాన్బాణమయూరదండిముఖ్యాన్" ౧౪౧

"తదనన్తర మేష కామరూపానధిగమ్యాభినవోపశబ్దగుప్తమ్
అజయత్కిల శాక్తభాష్యకారమ్"— ౧౫౮

"అభిభూయ మురారిమిశ్రవర్యం సహసా చోదయనం విజిత్య వాదే
అవధూయ చ ధర్మగుప్తమిశ్రం"— ౧౬౨

☞ పై శ్లోకములందు స్మరింపఁబడిన పురుషుల కాలము నొకింత విచారించినచో శంకరులకు సమకాలికులు గాకపోవుట యటుండ సన్ని

హితకాలికులుగూడ కాక ఎప్పు డెప్పుడో యెక్క డెక్కడనో యున్నట్లు దెలియవచ్చుటచే నట్టివారలతో శంకరులు వాదించి వారలను జయించి రని కల్పించుట సర్వవిధముల సత్యేతరప్రకల్పనము. పాప మీ విష యమున శ్రీహర్షకాళిదాసాదులు కవియొక్క కల్పన నలంకరింపకపోవుట యత్యాశ్చర్యము. ఇఁక నిందు స్మరింపఁబడిన శివతత్వరసూత్రభాష్యము, కువృత్తిజాలము, శాక్తభాష్యము అనునవి సర్వవిధములఁ గవియొక్క మనోవికారమాత్రములే కాని వస్తుగతి నెంతమాత్రముఁ గల్గియుండలేదు.

౨3. పదునాఱవసర్గమున—

"అథ యదా జితవాన్యతిశేఖరోఽభినవగుప్తమనుత్తమమాన్త్రికమ్,
స తు తదాఽపజితో యతిగోచరం హతమనాః కృతవాన నపగోరణమ్.
సతతోఽభిచచార మూఢబుద్ధిర్యతిశార్దూల మముం ప్రరూఢరోషః
అచికిత్స్యతమో భిషగ్భిరస్మాదజనిష్టాస్య భగందరాఖ్యరోగః"

అను శ్లోకములు మొదలు—

"అమునైవ తతో గదేన నీచః ప్రతియాతేన హతో మమార గుప్తః"

అను శ్లోక మంతముగాఁగల ముప్పదిరెండు శ్లోకములచే నొక మృషా కల్పనము నెందులకుఁ గవి సేసియుండెనో యద్దాని నాకవియే గుర్తెరింగి యుండవలయును. అభినవగుప్తుఁడు క్రీస్తునకు వెనుక పంద్రెండవశతాబ్ద మునఁ గాశ్మీరదేశములందుఁ బ్రసిద్ధిఁ గాంచినట్టి త్రికసంప్రదాయ ప్రవర్తకుం డగు వామాచారనిష్ణాతుఁడగు శాక్తేయుఁడు. అట్టి యభినవ గుప్తునిచరితము సువిదితము. శ్రీవిద్యాశంకరభగవత్పాదులకును నభినవ

గుప్తునకును నడుమ గడచిన దీర్ఘకాలమును దెలిసికొనినవార లీ కవి సర్వవిధముల మృషాకవి యని సుకరముగఁ దెలిసికొనఁగలరు. కానం జేసి యీముప్పదిరెండు శ్లోకములును సత్యేతరమగు తుచ్ఛకల్పనమే.

౨౮. ఈపదునాఱవసర్గమున—

“ ఆచార్యశంకర మహోచ దనఙ్గవాచా ”

యను నెనుబదిరెండవశ్లోకముమొదలు నెనుబదియేడవశ్లోకమువఱకుఁ గల యాఱు శ్లోకములును సమరకశరీరప్రవేశప్రసంగమును దృఢపరచుటకుఁ జిత్రింపఁబడియుండుటచే నయ్యవి మృషాకల్పనమే.

౨౯. ఇట నీ కవి దనకావ్యమునందు శ్రీవిద్యాశంకరభగవత్పాదులు ధర్మసంస్థాపనమునకై లోకోత్తరముగ నెలకొల్పిన పరమహంససామ్రాజ్యప్రస్తావన నించుకేనియు స్మరింపకఁ బోవుటయ కాక అట్టి మహాకార్యమున కెన్నఁటికినిఁ గూడ గతి కలుగుటకైన నవకాశము లేనట్టి కుకల్పనముతో నొక శ్లోకముతోఁ ద్రోసిపుచ్చియుండెను. ఆ శ్లోకము తొంబదిమూడవశ్లోకముగా నిట్లు పరఁగుచున్నది—

“ఇతి ముని రతితుష్టో ధ్యుష్య సర్వజ్ఞపీఠం
నిజమతగురుతాయై నో పున ర్మానహేతోః
కతిచన వినివేశ్యా ధర్మ్యశృంగాశ్రమాదౌ
ముని రథ బదరీం స ప్రాప కైశ్చి త్స్వశిష్యైః”

వాస్తవమున నీ కుకవికి శ్రీవిద్యాశంకరభగవత్పాదప్రతిష్ఠితంబు లగు ద్వారకయందలి శారదామఠమును, బదరికాశ్రమమునందలి జ్యోతిర్మఠ

మును, శ్రీజగన్నాథమునందలి గోవర్ధనమఠమును గూర్చి యెన్నడును విని యున్నట్లుఁగూడఁ దెలియరాదు. వేయేల? శృంగగిరియందు శారదను బ్రతిష్ఠించినట్లు మాత్రము వర్ణించినకవికి అట నేశిష్యుని నియమించెనను విషయముగూడఁ దెలిసి యున్నట్లు దోపదు. వేయేల? శంకరభగవత్పాదచరిత్రమును గూర్చి సామాన్యజ్ఞానమునుఁగూడ నీకవి కలిగియున్నట్లు దోపదు.

## కవియొక్క కాలము

ఇంతవఱకు లోకమునకు సుప్రసిద్ధముగఁ దెలియవచ్చుచుండ సంక్షేప శంకరజయమునందలి తుచ్ఛప్రసంగములను, దుష్టకల్పనలను, సత్యేతర ప్రంగములను, స్థాలీపులాకన్యాయమున నామూలాగ్రము ప్రదర్శించి యుంటిమి. ఈగ్రంథమును గొందరు కావ్య మని తలంచుచున్నారు. ఇయ్యది కావ్య మని చెప్పువారల కియ్యది దుష్టకావ్య మసత్కావ్య మను పదములచే దీని స్వరూపమును సూచించుచున్నారము. ఇట్టి దుష్టగ్రంథమును మాధవవిద్యారణ్యులు రచించి రనుట సర్వవిధముల సత్యేతరమే. అంతియకాదు. కవి దన్ను నవకాలిదాసనియును, వ్యాసాచల కవియనియును బేర్కొనియున్నాడు. ఇందు నవకాలిదాసపదము కవిచే నాత్మస్తుతికొఱకు వ్రాసికొనఁబడిన దని చెప్పితీరవలయును. ఇఁక పరిశేషన్యాయముచే నీకవిపేరు వ్యాసాచలకవియైనఁగావచ్చును. వ్యాసాచలకవి పదముగూడ బిరుదమే యైనచో రెండు బిరుదములకు నాశ్రయుడగువ్యక్తి యొక యజ్ఞాతకుల గోత్రనాము డని చెప్పితీరవలయును. ప్రకృతము గ్రంథమునఁ దెలియవచ్చెడి నామవిశిష్టు డెవ్వ డగుఁగాక,

ఆతనికాల మెద్ది? ఈగ్రంథ మెప్పుడు రచింపఁబడె? నను విషయ మొకింత యోచించుట ప్రకృతమునకుఁ బ్రయోజనమును గలుగఁజేయును.

ఈగ్రంథమునందు వర్ణింపఁబడిన విశేషములయొక్క ప్రత్యేకపుటతిశయ మెట్లు పరగుచున్నను నొక విషయ మత్యంతనై పుణ్యముతో గ్రంథము యొక్క యాద్యంతములం దించుమించుగా వర్ణింపఁబడియున్నది. దానంజేసి యాద్యంతగ్రంథ సందర్భమునుబట్టి తన్మధ్యస్థ విషయములకుఁ గూడ నందే తాత్పర్యము గలుగు నని యుపక్రమోపసంహారన్యాయ కోవిదులు దెలిసికొనఁగలరు. అట్టి విషయవిశేష మెద్ది యన—

బాల బ్రహ్మచారిసన్యాసము, అట్టి బ్రహ్మచారికిని నాతనితల్లికిని మధ్య దెలియవచ్చెడి వ్యవహార విశేషమును. ఏతద్విషయము సంక్షేపశంకర జయమున నైదవసర్గమునను బదునాలవసర్గమునను బుష్కలముగ వర్ణింపఁబడియున్నది. ఈగ్రంథమును మాధవవిద్యారణ్యులే రచించినచో యీసర్గము లీతీరున నుండుట కవకాశముండి యుండదు. శ్రీవిద్యా శంకర భగవత్పాదలకుఁ బిమ్మట శృంగగిర్యాధిపీఠములందు వృద్ధులగు యతివర్యులే పీఠాధిపతులుగ నలరారుచు ధర్మసంగ్రహము గావింపఁబడు చుండెడిని. కొలదికాలముక్రిందట మురికినాటి సమాజమునకుఁ జెందిన కొందరు శాపదగ్ధబ్రాహ్మణాధములు శృంగిగిరిక్షేత్రము నాక్రమించుకొని యచట పవిత్రతమంబుగ నలరారుచుండెడి భారతీసంప్రదాయమును మట్టిఁ గలిపి బాలబ్రహ్మచారులను సన్యాసివేషధారులుగఁ జేసి యచట నెల కొలిపి యకృత్యముల సాగింప మొదలిడినపిమ్మట నీదుష్టకావ్యము సాభిప్రాయముగ నవకాలిదాసవ్యాసాచలకవిచేఁ జిత్రింపఁబడిన ట్లూహిం

చుటకుఁ జాల యవకాశము గలదు. ఇఁక శృంగగిరియం దిట్టి దురా చార మెంతకాలమునుండి బయలుదేరియుండు నను విషయమును దెలిసికొనుట కెక్కుడు ప్రయాస మక్కరలేదు. అద్దానికొఱ కిప్పుడు శృంగేరివఱకు మనము పో నక్కరలేదు. భారతీసంప్రదాయచరిత్రము నెఱింగియున్న మా కీ విషయ మొకింత నిస్సందియముగఁ దెలిసియే యున్నది. శృంగేరీ శ్రీనిరూపాక్ష శ్రీపీఠాధిపతులగు నుద్దండభారతీజగ ద్గురువులు దక్షిణదేశమున దిగ్విజయము గావించి శృంగగిరికి విజయం చేసినకాలమువఱకు నీదుర్వ్యాపార మట ప్రసరించియుండలే దని తెలియ వచ్చెడిని. ఉద్దండభారతులు దక్షిణదేశమున దిగ్విజయము చేసినకాలము క్రీ. వె. 1790 వ సంవత్సరమునకుఁ బిమ్మట. ఉద్దండభారతు లన్ననో బందరుపురమున సిద్ధిబొంద నచట శివగంగయందు వారియుపాధి సమాధి చేయఁబడుట యెల్లఱకును దెలిసినవిషయమే. ఉద్దండభారతులనిర్యాణా నంతరము శృంగగిరిమఠము సర్వవిధముల దుష్టులపాల్పడ క్రీ. వె. 1800 సంవత్సరమునకుఁ బిమ్మట బ్రహ్మచారిసన్యాసుల నట నెలకొలుపు దుష్కృత్యము ప్రారంభమై యున్నది. కావున నీ సంక్షేపశంకరజయము క్రీ. వె. 1800 సంవత్సరమునకుఁ బిమ్మట బయలువెడలియుండవలయును. ఇం దొక విశేషము గమనించఁదగినది కలదు—పూనాయందలి యానం దాశ్రమమువార లీ గ్రంథమును ముద్రించునపుడు నన్వేషణముఁజేసి సంపాదించిన గ్రంథములలోఁ బ్రాచీనగ్రంథముయొక్క లేఖనకాలము ౧౭౫౭—వ శక మని ప్రకటింపఁబడియున్నది. ౧౭౫౭ శకకాలమన— ౧౭౫౭+౭౮=1835 క్రీ. వె. వత్సరము. కావున నీ సంక్షేపశంకర జయము క్రీ. వె. 1800—1835 వత్సరముల మధ్య బయలువెడలి యుండుటయేగాక గ్రంథమును రచించినకవియును వ్యాఖ్యాతయును

గూడ సమకాలికులే యని నిశ్చయింప నగును. భారతీసంప్రదాయసార్వ భౌములును నఖిలవిద్యాపారంగతులు నగు శ్రీమాధవవిద్యారణ్యులు క్రీ. శ. 1330—1385 సంవత్సరములమధ్య నఖండతేజముతోఁ బరమహంససామ్రాజ్యాధిపతులై యున్నటుల సర్వవిధములఁ దెలిసిన విషయమే. ఆయన మహామహులు.

ఇట్టి దుష్టకావ్యమును రచించుటయ తప్పు. అద్దాని రచయిత నామ రూపములను దాచికొనుట పెద్దతప్పు. అట్టితరి నట్టి దుష్టకావ్యము నట్టి మహామహులకు నంట గట్టుట తప్పులలోనెల్ల పెద్దతప్పు.

ఇతి నారాయణస్మృతిః

---

# విషయసూచిక

ఓం

# శ్రీ విద్యాశంకరలీల

## ప్రార్థనము

బ్రహ్మానన్దం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిమ్
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్,
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతమ్
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

నారాయణసమారమ్భాం విద్యాశంకరమధ్యమామ్,
కల్యాణానన్దపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్.

శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయమ్,
నమామి భగవత్పాదశంకరం లోకశంకరమ్.

శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణమ్,
సూత్రభాష్యకృతౌ వన్దే భగవన్తౌ పునఃపునః.

శారదా శారదామ్భోజవదనా వదనామ్బుజే
సర్వదా సర్వదాఽస్మాకం సన్నిధిః సన్నిధిం క్రియాత్.

*　　*

అంచితభ క్తి నెంతు హృదయాంతరభూమిని భూమవేదవా
క్సంచయసంప్రకాశకృతిసాధనవక్త్రపవిత్రుఁ దీవ్రయో
గాంచదుపాస్తినిష్ఠపరహంససమావ్యపదాధినాథు న
క్కాంచనకంజసంభవు నఖండు విసృష్టసమస్తవిష్టపుఁ.

రామార్చ్యచరణనీరజవిశిష్టు వసిష్ఠు,
సంభృతోన్నతతపఃశక్తి శక్తి,
వరశౌచజితతరాశరు నప్పరాశరు,
వ్యాసితామ్నాయవిన్యాసు వ్యాసు,
నమృతోపమమృదులతమవచఃశుకు శుకుఁ,
గలితేడ్యమృదుపాదు గౌడపాదు,
గురుయోగభోగీంద్రు గోవిందయోగీంద్రు,
స్థిరయశస్సాంద్రు శంకరయతీంద్రుఁ,
బండితకులేశుల సురేశపద్మపాద
తోటకకరామలకులఁ దత్పూజ్యశిష్య
వరుల నన్వర్థనామభాసురుల సురవి
నుతుల నద్వైతగురువుల సతముఁ దలఁతు.

స్థిరకావ్యనిర్మితిశ్రీహర్షు శ్రీహర్షుఁ,
గవితాగమవ్యాసుఁ గాళిదాసు,
భూరితరప్రతిభారవి భారవి,
మిశ్రమనోబర్హిమేఘు మాఘుఁ,
గాకవ్యురగవారఘనమయూరు మయూరు,
నన్నుతవాఙ్నిధి నన్నయసుధి,

సుకవిజనస్తోమసోముఁ బ్రెగ్గడనాము,
ధీనిర్జరాచార్యుఁ దిక్కనార్యు,

వేంకటప్పాఖ్యుఁ గవిముఖ్యు, విదితకీర్తి
కౌముదీరాజు శ్రీపాదకవివిరాజు,
రాజితగవీవిభవులఁ దిర్పతికవులఁ ద
లంతు సంతత మాఘనుల్ వంద్యపదులు.

### సంన్యాససంప్రదాయము

పావనముల కెల్లఁ బావనత్వముసిరి
వఱలఁ జేసి పెరిమ మెఱయఁ బరమ
ములఁ బరమమ యవుచుఁ బొలుపారు సంన్యాస
సంప్రదాయ మన్న నైక మవునె ?

వా దఱి యాదానైన యను
వేదం జదియించువలఁతి కెంతే నిరతిం
గాదే బ్రహ్మపదమ్ము మ
హాదృతి నఱచేతిబెల్ల మఖిలముఁ జెల్లన్ ?

ఎల్లకర్జములకు నెడ గల్గి వెల్గుచు
నొందుఁ దవులఁ బోమి, నేల్గడ యయి
ముక్తిపథమునకు, విరక్తిఁ బొలించు ను
దంచితాశయుండ అసపుకొండ.

చరమాశ్రమమ్మె పరమము,
తిర, మెందును దీనికన్నఁ దెలియము వరమున్,
చరమాంశము ప్రణవమ్మున
నరుదారున్ జప్య మేతదాశ్రమిమయమై.

ఆసంప్రదాయము శుభ
వ్యాసంగసుసంగతంబు పావనశరణం
బీ సర్వంసహా వైదిక
భాసురధర్మానుసరణపరులు ద్విజులకున్.

శరణము, భయజలధిసము
త్తరణము, కరణము తతామృతత్వాప్తికి, నా
భరణము తత్పరమతులకు,
శరణం బది వంశ మన నెసంగును చేరన్.

అదియు నిరుతెలుంగు లయ్యె నొయ్యన నార్య
జనులనొడులబడుల జన్మవిద్య
లను నెలకొని. అందుకొను నందు గుణమును
నుత్తమోత్తమమ్మె నుత్తరమ్మె.

విద్యావంశ మ్మన నన
వద్యము, సత్పద్య బ్రహ్మపదలబ్ధికి, శ్రీ
విద్యావిలాసినీనట
నోద్యోగమురంగభూమి ఒనరునొనరికన్.

తమి నారాయణుఁ డాదికాలమున విద్యావంశమున్ బాని లో
కమునందున్ నెలకొల్పెఁ బొల్పు లెస గంగా భారతీసంప్రదా
యముపేరన్, నలువారె నయ్యదియు నత్యంతప్రసిద్ధం బను
త్తమ మై భారతభూమికిం దొడవుఁ దాత్పర్యంబునం గూర్చుచున్.

"సాగరమునకు నుత్తరభాగమున, హి
మాద్రికిన్ దక్షిణమ్మున నమరి పెరిమ
భారతీసంతతిం దనరారునద్ది
భారతము వర్ష మనుపేరఁ బ్రథితిఁ బడయు."

అని భారతవర్షము వాం
దినయుత్కర్షమును భారతీసంతతి హె
చ్చునఁ బర్వినపరిమళలన
మనిరి పురాణమ్ములందు నఖిలమునీంద్రుల్.

కాలము లెల్ల మేలు మొనయుపేర్మికి భార
తమ్ము వర్షమునెఱి, దానిరమకు
భారతీపరంపరారూఢసుస్థితి,
దానిసిరికిఁ గతము ధర్మరక్ష.

కడఁగి పూర్వదేవులఁ బులికాఁపు పెట్టి
ధర్మదేవత నెలయింపఁ దవినదారి
నరిగదాధారి ధారణి ననధరించె
జిష్ణుఁడై యవతారమ్ముఁ గృష్ణుఁ డనఁగ.

### ధర్మజునికాలమున ధర్మస్థాపనము

వేదమూర్తి యతఁడు వైదికధర్మమా
ర్గమ్మునడుమఁ గుదురు గట్టి యున్న
తులువమూఁక లన్నదొడ్డముం డ్గెడలించి
నడపె ధర్మవృషము నాల్గుకాళ్ళ.

ఆ పరువునఁ దిర మొనరుప
నాపురుధర్మమ్ముఁ గృష్ణుఁ డాతఁడు కృష్ణ
ద్వైపాయనుఁ డన మొనసె స
రూప మ్మెనెటిని లేనిరూపాంతరముల్.

మినుక నేరరు పిసరంత కునికి యాలు
నలుపవుమదుల నసదులు కలిజను లని
వరుస విభజించె రాసులఁ బ్రామినుకుల
నతఁడు తనవ్యాసనామమ్ము సార్థకముగ.

ప్రాంశుయశోవిలాసమున రాజిలుతేజు గలాఁడు భారతీ
వంశవివర్ధనుండు ముని వ్యాసుఁడు ధర్మువుచొప్పు నెప్పు డే
యంశమునం దొడింబడనియట్టిది గట్టిపునాది వైచి ది
వ్యాంశమనోహరక్రమము యానటు కూరిచెఁ గృత్తసూత్రుఁ డై.

పెనిచి పురాణధోరణులు, పిట్టకథల్ వెయివేలు సెప్పి, ప్రా
దినులపొగడ్త నూలుకొని, దేవునిదివ్యవిలాసముల్ రచిం

చి, నృపచరిత్రముల్ నొడివి, చేకొని సూత్రము లల్లుపొందికం,
బొనరిచె వేదధర్మపథబోధనముల్ ముని యెల్లవారికిన్.

అద్వైతశ్రుతిగోచరక్రమఘనుం డాకృష్ణుఁడున్ వాని కృ
ష్ణద్వైపాయనుఁడుం గడున్ నిలిపి రాజ్యమ్మందు ధర్మాత్మునిన్
విద్వద్వర్యుని ధర్మజుం బుడమి స్థాపింపం బనిం బూని రం
చద్వేదోదితధర్మముం దవుల కేచాయన్ నిరోధమ్ములన్.

చక్రరక్షకులుగఁ జాలి కలాభివ
ర్ధిష్ణు లాయిరువురు కృష్ణులచెయు
యూఁత సాగిపోయె నొడుకుదుఃఖులు లే
కధిపుధర్మపాలనాభినిరతి.

వ్యాసమౌని సూప నయినపద్ధతి, ధర్మ
నందనుండు లెస్స పొందుపఱుప,
నడఁప మడఁప నడరునడ్డంకు లరి
ధారి, తనరె నపుడు ధర్మసరణి.

గరుడమంత్రమ్ము లై వ్యాసగరుడరథుల
ప్రబలబోధోద్యమములు ధర్మజునిశిక్ష
ప్రాల్చినతల నధార్మికపన్నగములు
మరల నెగనెత్తుమాటకు మలయవయ్యె.

తొడరి ద్వాపరమ్ముతుది స్థాపితము ధర్మ
మదియుఁ గలిని మూఁడు పదులుఁ దొమ్మి

దియును పాయనములదిష్టమ్ము సనుదాఁక
నప్రతిహతమ యయి యతిశయిల్లె.

### ధర్మవిప్లవము - కుమతవ్యాప్తి

ఎసఁగులలిఁ గలి క్రొకవేయియేండ్లయీఁడు
పయిఁ బడినయంతఁ గలి రేఁగి వసుధ యెల్లఁ
దాఱుమాఱయ్యె, నయముపథమ్ము పులుఁగు
సెల్లె, మామిళ్ళు గూలె జిల్లేళ్ళు మొలిచె.

దొరలు దాసులైరి, దొరలైరి దాసులు,
క్షత్రియాన్వయజులు కడలిఁ బడిరి,
శూద్రకులమువారు క్షోణికి మగలైరి,
వేదపథము దానఁ బేదపడియె.

ధర్మమార్గ మెఱుఁగని శూద్రప్రభుండు
ధర్మ మొకరుంపు కయికొని తఱిఁగి నఱికి
పాదములు నాల్గు కూలుచుపనికి మొనయ
ధర్మదేవత నిల నెవ్విధాన నేర్చు?

సరవి న్యాయ వైశేషిక సాంఖ్య యోగ
పాశుపత జైన సౌగత పాంచరాత్ర
ముఖ్యములు కుమతమ్ములు మోసులెత్తి
నిండె నెల్లెడ ధరణిఁ బ్రచండ వృత్తి.

కాంచి నడపోసి కల యెల్లకలలు లెస్స
తిగిచి సారమ్ము సత్యవతీసుతుండు
పోళి నింపినధర్మద్రుమాలవాల
మింకునెటి కయ్యెఁ గుమతాలయెండ వాటి.

విమతాంధకారమ్ము వేవేగ పీఁగించి
వేదోక్తధర్మమ్ము వెలయఁజేయఁ
బరమప్రమాణశిఖరమున నరుదారు
వాసి వేదవ్యాసవరమునిప్ర
సాదితమ్ములు, లలి వేదాంతదర్శన
మును, జైమినిమునిదర్శనము, గీత,
లలితారహస్యనామలలితస్తుతి, ఈశ,
కేన, కఠ, ప్రశ్న, మానితైత

రేయ, కౌశీతకీ, తైత్తిరీయకములు,
ముండ, మాండూక్య, ఛాందోగ్యముఖ్యములు, బృ
హదృతారణ్యకంబు, శ్వేతాశ్వతరము,
నన నెసంగెడునుపనిషద్గణములును,

ధర్మరాజుఁబోలు ధర్మప్రభువు లేమి,
వాసుదేవున కెనవచ్చునండ
లేమి, లేనివ యన నామమాత్రావశి
ష్టమ్ములై కొనెః బలుచందనమ్ము.

శంకరావతారావశ్యకత

అమ్మెయి ధర్మవిప్లవ మనంతకు నంతకు నంత కంత కం
త మ్మను మాట లేనియెయిదం బ్రబలామయమట్లు సోఁకి భీ
దమ్మగఁ గ్రమ్మకో, ఖిలమతమ్ములు తొల్లిటివెల్ల నెత్తి శీ
ర్షమ్ములు భారతీకులమురాయిడికిం గలుగన్ మహోర్భటిన్.

కలి ననలనిధిబాణాక్షికలిత మైన
కాలమునఁ గ్రీస్తునకు మున్ను కంజసంభ
వాంబరాశుగమితమున హాయనమున
జనన మొందె శంకరుఁ డిలాశంకరుండు.

భారతీసంప్రదాయమ్ము వఱలుప్రౌఢి
భారతమువర్షమునఁ బెనుపార నిలిపి
వేదమార్గమ్ము మెఱయించి వైదికులకు
భిక్ష పెట్టినదిట్ట ఆభిక్షువరుఁడ.

అష్టమవర్షమంద చరమాశ్రమముం గొనఁ గోర్కెఁ బెంచుచున్
విష్టపశంకరుం డతఁడు పేర్పడి దండ మొకండు వూని సం
పుష్టము వేదవాదమున మూయకయున్న మతాంతరాస్యమున్
భ్రష్టత భారతోర్వి యిది మాదిగమంచము గాక నిల్చునే?

దురహంక్రియాయుక్తి నరయఁ బో వొకయింత
క్రిందును మీఁదు నుచ్ఛృంఖలములు,
చొరనీక యెది వీఁక శ్రోత్రరంధ్రంబుల
మొఱగు నూరక తమమోర లెత్తి,
వహియించినప్రభుతఁ బయిఁ బడు నెది కన్నఁ,
జఱచిన వెన్నంటి వెఱపుగనవు,
పరమర్మభేదనపరతఁ జరించుఁ బా
షండులు నా నూరిజాగిలములు;

వానికతమున వైదికపాంథు లెనసి
వెఱపు, లిక్కట్టు లెట్టివి పెరయఁబోరు
మృగములట్టులు, కూరిమి మేర మీఱ
సాఁకకుండిన దండియై శంకరుండు?

ఫలశ్రుతి

కుమతపంకప్రదిగ్ధ మీ కుతలము స్వన
చనసుధారసాసారసంక్షాళితమ్ము
సలిపి నిగమాంతసుధఁ గెలఁకుల నమర్ప
నవతరించె శంకరుఁ డట్లు యతిపతి యయి.

ద్వైతకంటకకీర్ణ మద్వైతపథము
పులుఁగు సెడి పాడువడక సముద్ధరించి

నట్టికర్మందిచంద్రమునసమయశము
సారెఁ గీర్తింప కెటు లవు జనుఁడు సుకృతి ?

వరసూక్తినద్యుతి నం
తరకుహారభిదాంధతమముఁ దవిలి తఱుము శ్రీ
గురుకథ నాదృతిఁ బొరయని
నరుఁ డలరంగలఁడె గురుఋణము నీఁగఁగ నై ?

మానితనిగమాంతపథా
నూనప్రామాణ్యమునకు నూఁత ఘనం బి
ద్దానిఁ వ్రాసినఁ జదివిన
రాణిఁ విన నేకరసము బ్రహ్మ మెఱుక కౌ.

ఓం

# శ్రీ విద్యాశంకరలీల

## శ్రీ విద్యాశంకర జననము

శైలకులాధినాథతనుజాముఖసారసచంచరీక మా
పాలితవిష్టపాలి వృషభక్షితిభృద్వరవాసి శూలి యే
కాలముఁ గాఁచిప్రోఁచుదొర గా సిరి కిల్లయి చూర్ణికాతటిం
గ్రాలును మేలిప్రో లొకఁడు కాలటి నా నలువారుపేరిటన్.

సర్వసులక్షణసంపన్నమై హృద్య
పద్యార్థ్యత సుకవిత్వమ యనంగఁ,
బర్వతాజస్రగుప్తత నభేద్యస్థితి
నమరి మహాభారతమ యనంగ,
బహులకచ్ఛపపూర్ణపద్మాకర మ్మయి
నరవాహనునికూర్చుపుర మనంగ,
సుమనోజనగణసుశోభితప్రాంతమ
మై నాకలోకమ యది యనంగ,

సభికసంకీర్ణమై ద్యూతశరణ మనఁగ,
ధనమహోన్నత మై గోష్ఠతలమ యనఁగ,
నొప్పి యాపురరాజ మీయుర్వి సర్వ
సంపదలకాపుర మ్మయి యింపుఁ గొలుపు.

అందు నవేందుకలాధర
సుందరపాదారవిందసుస్థిరసేవా
స్పందయశుఁడు భూసురుఁ డొకఁ
డొందును శివగురుఁ డనంగ నొనరుప్రశస్తిన్.

శివుఁడు గురుఁడుం డన్నృమణికి,
శివునకు గురుఁ డతఁడు, దైవచింతకుల కభే
దవిచారము రూఢము, యటు
శివగురుఁడ యన ఘనుఁ డతఁడు సెల్లకయున్నే ?

అలఘుతరశ్రవోమహిత మన్వయ, మందు ధరామరేశతా
కలన, కలాప్రవీణత, నికామసుఖాస్పదజీవనంబు, ప
ద్మలనయనాజనప్రసవచాపధరాయితరూపవైభవం
బలరిన వాని కున్నె యెన యానతఁ డొక్కరుఁడేని నెందునన్ ?

చరణాయుధారవశ్రవణంబుతోడన
భూతేశచింతనోన్ముఖత లేచి,
చూర్ణీధునీమణీశుద్ధోదకంబుల
నఘమర్షణస్నాన మాచరించి,
సాంధ్యకృత్యముఁ దీర్చి, సవితృ నారాధించి,
తన్మండలాంతర్గతన్ జపించి,
వల్లెవెట్టుచు శ్రుతు లల్లన వెంట రా
ఛాత్రులు నిజనివాసమ్ముఁ జేరి,

భక్తియుక్తచిత్తత హవ్యవహుని వేల్చి,
శ్రుతితతిపఠనపాఠనాదృతిఁ దలిర్చి,
పితరులకుఁ దర్పణము లిడి, యతిథిజనులఁ
గొలువ నెదురుసూచుచునుండు నుదుగ కతఁడు.

ఆమహామహితాత్మునిసోమిదమ్మ
యార్య గొనములఁ బేరున, నాప్రపూజ్య
పొగడితకు నెట్టినోడువులనెగడితయును
జాల దేలలి ననుమాట సాహసంబె ?

అరయ దుర్మతోత్తాపితమైన భూవ
లయము లయ మొంది భయదజలనిధి నడఁగఁ
దివురఁబోవమి తాదృక్పతివ్రతాఘ
తల్లులపదరజంబు మైఁ దాల్చి కాదె.

ఆపుణ్యదంపతులకుం
బ్రాపింపని దయ్యె సుతులఁ బడసెడుభాగ్యం
బే పెద్దకాల, మోలిమి
నేపారఁగ నవ్వవాయ మెనసినచాయన్.

వారుఁ గుమారులం గనఁగ వాఱనికోరికి పెంపువాఱ నా
ర్యారమణుల్ వృషాచలకృతాలయు వ్రాలనిభక్తిఁ గొల్చి రా
భూరికృపాసముద్రుని యమోఘ మనుగ్రహ మచ్చివచ్చి యా
ర్యారమణీవతంసమున కై మసలెన్ నెల చిక్కెఁ జీరెయున్.

కడుపునం గల నిసుఁగునెగడితకుం గ
తంబ యయ్యె విధి నెఱింగి ధరణిసురన
తంసుఁ డాతఁ డొనర్చినపుంసవనము
దొట్టిసంస్కారనికరంబు దొడరుపెఱిమ.

అను వొందం గనెఁ బుత్త్రి నార్య, కలి సప్తార్చిస్స్వభూబాణలో
చనముల్ లెస్సగ లెక్క సెప్పఁగలవర్షమ్మందు ని మ్మొందునం
దనవై శాఖముశుక్లపంచమినిఁ బ్రధ్నస్వామికాహమ్మునం
దునఁ దిష్యర్క్షమునన్ ధనుస్సముయమందుం గ్రందుకో సంపదల్.

ఉదితుఁ డర్భకుఁ డీతఁ డత్యూర్జితస్వ
కశ్రవశ్చంద్రికాధౌతకాంతము నొన
రించుఁ దను నంచుఁ గాఁబోలు మించె సుప్ర
సన్నత విమతపంకిలాశాచయంబు.

పోలె మాతరపితరసమ్మోదబాష్ప
భరమున నపనీతరజోలవములు సుధృత
సుమరజోభరములు పావనము లవు పవ
నము లొగి మలసె మందమందముల గతుల.

సందియం బేల ? శివగురునందనుం డి
తండు విమతవాదబహుళేంధనము లొసఁగి
హ్యాప్తపుష్టుఁ బొనర్చు న న్నికఁ నటంచు
ననలుఁ డుల్లసిల్లెఁ బ్రదక్షిణార్చి యగుచు.

స్నాతుఁడై శుద్ధజలముల భూసురాగ్ర
గణ్యుఁ డతఁ డొనర్చినజాతకర్మ మదియె
భువనశంకరతాస్ఫూర్తిఁ బ్రోదిసేసి
శంకరాభిఖ్య నర్థనిశ్చలముఁ బఱిచె.

లలి మకరశంఖపద్మోపలక్షితతర
చరణలసిత మ్మఖర్వమ్ము వరగుణమ్ము
సుతనిధానమ్ము లభియింప శోభిలె శివ
గురుపితౄణము రీణమై కొఱఁతవడక.

అతఁడుం బొంది దైనందినాభివృద్ధి
మహితతరహర్షవార్ధినిమగ్నమాన
మానసులఁ జేసెఁ బితరుల నైనవారిఁ
బెరసి శుక్లపక్షక్షపాకరునిసరణి.

తత్తత్సమయోచితవిధు
లత్తత్త్వజ్ఞుఁడు శివగురుఁ డతితరమోదా
యత్తమ్మునఁ జిత్తమ్మున
నత్తనయున కాత్తనయున కాచరియించెన్.

పంచమాబ్దోపనీతుండు బ్రహ్మవర్చ
స మ్మతితరమ్ము గసుఁగానఁ జలిపి యట్లు
సర్వశాస్త్రరహస్యవిత్సార్వభౌముఁ
గాఁ బొనర్పించె గురువులచేఁ బరంగ.

లలి సుఖసంప్రాప్తసకల
కలాచతురతాయుతుండు ఘనుఁ డతఁ డలరం
గలిగెఁ బిత్ృమోదహేతుత
జలరాశికి నెటులు పూర్ణచంద్రుం డటులే.

### శివగురు నిర్యాణము

అంతఁ గొంతకాల మరిగినయవల ని
రతశివార్చనాభిరతుఁడు శివగు
రుండు వొరసెఁ దా నఖండశివపదమ్ముఁ
బిదప శంకరుండు ముదము పొదల—

చని గోకర్ణము క్షేత్రరాజమున కెచ్చం బేర్మి మూఁడేండ్లలో
నన వేదమ్ములు మూఁడు నేర్చి నెఱి చిందన్ నాల్గువేదంబులం
దును దా నందెలు వేసినట్టిచెయియై తోరంబునన్ మీఱె నీ
డెనయంగా నొక యెన్మి దేఁడులుగ లెక్కింపంగ నాసంపదన్.

### ఆశ్రమస్వీకారము

కొని గురునాజ్ఞ సమావ
ర్తనమున సత్కీర్తి మెఱసి ధన్యుఁ డతండుం
దనతల్లియడుగుదోయికి
వినమించి శిరమ్ము మ్రొక్కి వినయమ్మెనయన్.

మెలఁగుచు నింట నమ్మోలపునఁ గారణ
జన్ముఁ డతఁ డెడ నీసరణిఁ దలఁచె—
రహిఁ నేర్చి విద్దెలు బ్రహ్మచర్యమునన
పరఁగెడునాతఁడ ప్రవ్రజించి
వనులదారులఁ జేరె బ్రహ్మభూతత బ్రహ్మ
పదమునఁ బదమును బడయు టొండె,
నొప్పనొప్పులకుప్ప నొకరితఁ బెండ్లాడి
గార్హస్థ్యముం దీర్పఁ గడఁగు టొండె,

వలయు ననిరి విప్రకులునకుఁ దెలిసిన
వార; లందు నెట్టిదారియందు
మొనయువాఁడ నింక? నెనయు శ్రేయమ యెందు?
విధిని దాఁటరాని విధి తలంప.

ఇంతిఁ జెట్టవట్టుదు నన్న నెనిమిదేండ్ల
వాని కది యెట్లు? నిఖిలమ్ము మాని యూర
కుండు నన్న నేయాశ్రమమందుఁ జొరక
చనదు నిలువ నిమేషమ్ము ననిరి బుధులు.

అదియు నట్టు లుండె, నదనున మనుజుఁడు
ద్వంద్వమయము జగముపై నిఁ దనుల
మెడయఁ ద్రోసి ముక్తిఁ బడయఁ బ్రయత్నింప
వలయుఁ గాన లెస్స ప్రవ్రజనము.

అని తననిశ్చయించుకొనినట్టి తెఱంగును గన్నతల్లికిం
జనవున విన్నవించుకొనె శంకరుఁ, డార్యచరిత్ర యార్యయుం
దనయునిబుద్ధివైభవమునం దనరారుమహార్థసిద్ధికిం,
దన కయిరానిదారికి, ముదంబును, శోకము నొందె నాత్మలోన్.

అమ్మహాసాధ్వి యిట్లని యనియెఁ దనయ!
విదితనయుఁడ వీ వెఱుఁగనియదియ లేదు.
పూని కానక కన్న సంతాన మొకఁడుఁ
గాన కైకాని దై చనఁ గలనె నిలువ?

అని వనటం బడు కూరుచు
జనని నొడంబఱచి తవువచనములతోడన్
జనవినుతుఁడు శంకరుఁడుం
గొని చరమము నాశ్రమమ్ముఁ గొనఁగఁ దదాజ్ఞన్,

ముప్పిరిం గొన గాఢమైన యొప్పుభక్తి
చుట్టి ముమ్మాఱు, భోగ్యవస్తువులపయిని
నాసతోఁబాటు మమతను నవలఁ ద్రోసి
యరిగె గోవిందగురునాథు నరసికొనుచు.

### గుర్వన్వేషణము

పారము కాన రాని బలవద్భవవార్ధివిరక్తియుక్తి నా
భూరిగుణుండు శంకరుఁడు మోదమునన్ సమకట్టె నట్టులే
దూరము యేఁగఁ, జేరువన తోరమువై రహిమీఱు నావ గం
భీరసముద్రమధ్యమున వీఱిఁడియై పడునే నరుం డిలన్?

త్రినయనానువాదము వానిదృక్పథమున
నేనిఁ గామభూతంబు కా లూనదయ్యె;
నోలి ఘటియింప నేర్చెఁ దన్మూలకభవ
పాశబంధ మ దెట్టు లవ్వాలఁతియందు ?

అసురల నిష్పత్రుల, సుర
ల సపత్రుల, దేవయోనులన్ నిష్కులులన్,
వెస ననుల నరులఁ జలిపి
నసుమశరధనుర్ధరుఁడు తనరెఁ దజ్జితుఁడై.

పొంచి జయించె శాంతి మనమున్, గతిముఖ్యములౌ కృతుల్ నిరో
ధించెను దాంతి, మించె విషయేతరశూన్యత సత్త్వశుద్ధి, కా
వించెను శాంతి కోమలత, వేగ సమాధియు ధ్యాననిష్ఠఁ గ
ల్పించె, గ్రహించె శ్రద్ధ ప్రియవృత్తిని, వానివిరక్తి యెట్టిదో !

చేరె నర్మదదరిని ఓంకార మన్న
క్షేత్రమున భారతీకులకీర్తిగార
వములకున్ వన్నెఁ దెచ్చుచు వాసమున్న
ఘనుఁడు గోవిందనాథునిమనికిపట్టు.

డాసి యట్టు లాసుధీసన్నుతు సమాధిఁ
జాల యొసఁగువానిఁ గేలుదోయి
మోడ్చి సన్నుతించె మొగకొనుసద్భక్తి
శంకరుండు లోకశంకరుండు.

## గోవిందయోగీంద్రగురుస్తుతి

కల్మియుగ్మలినెమ్మొగమ్ముతామరతేటి
కఱివేల్పునంచరాగఱులసెజ్జ,
భువనాళి నా రంగభూమి నర్తించుము
క్కనులవేలుపుమేలికాలియందె,
మేటితాటిసిడమ్ము మెఱయ నందునిముద్దు
పట్టి కన్నగఁ బుట్టినట్టిదిట్ట,
మేలిమానికములమెఱుఁగుల కిరవులు
పడగలు వే లూని పరఁగువలఁతి,

తత మజాండభాండము తలఁ దాల్చుప్రోడ,
పాపయెకిమీనిమాఱుటరూప కావె
నీవు, గన్గవఁ గన్గొని ప్రోవ రావె
వేగ వినతు నన్ గోవిందయోగిచంద్ర !

నాఁడు నేఁడును నబ్ధికాననమహీధ
రాంచితోర్వీతలోద్ధృతి మించితి తలఁ,
జరణసరసీజయుగలరజంబు నింపి,
శేషుఁడవ యన వెలిఁగె యశేష! నీవు.

మొగములు వేలు భీతికరముల్ తిలకించియు పాఱె మున్ను శి
ష్యగణ మటంచు నెంచి వెలయన్ మొగ మొక్కఁడె శాంతవృత్తిఁ జ
పు గనినకూర్మిఁ బుట్టుఁ గొనఁ బోవె పతంజలి నా నభిఖ్య సాఁ
కఁగ జగ మెల్ల యోగకలఁ గ్రన్ననఁ దెల్పి యనల్పవైభవా !

ఆరచింపవె జగదుపకారపరత
నభ్యసించి ప్రవిష్టుఁడ వై ధరావి
వరమునన్ దండశూకేంద్రుదరినిఁ గళలు,
శబ్దభాష్యంబు వరయోగసంయుతంబు.

మోక్షుఁ గేల్గవ గుణగణపూర్ణ ! గౌడ
పాదకరుణాసమధిగతబ్రహ్మసంస్థ !
పూజ్య ! గోవిందయోగీంద్ర ! పూర్ణభక్తి,
బ్రహ్మసంస్థోపదేశాభిరతి తలిర్ప.

అంత సమాధినిరుద్ధ
స్వాంతుం డెవఁడ వని యోగి చంద్రుఁ డడుగ నీ
వంతునఁ బ్రతనసుకృతజా
త్యంతజ్ఞానపిశునోక్తు లలర యతి యనున్.

కాను భూతపంచకమ్ముఁ, దద్గుణములుఁ,
గాను సుమ్ము కరణగణముఁ, దద్వి
శిష్టుఁ, డఖిలకర్త, చిత్స్వరూపుఁడు, పర
ముండు, శివుఁడ యవు దఖండతేజ !

అన హర్షరసాప్లుతలో
చనవనజద్వయుఁడు యోగిచంద్రముఁ డను నో
య్యన శంకర! శంకరుఁడవ
జనియించితి వేదమతము స్థాపింప నిలన్.

## బ్రహ్మోపదేశము

ఇటులు నీదురాక నెఱిఁగికొంటి నఖండ
మౌ సమాధిదృష్టి ననుచు నెనరు
చెనయ నుపనిషత్ప్రసిద్ధ మేకరసమ్ము
బ్రహ్మ మయ్యతీంద్రపతికిఁ దెలిపె.

అట్లు తదధిగతోపదేశాఢ్యుఁ డీడ్యుఁ
డమలుఁ డఖిలకలాపూర్ణుఁ డ య్యతికుల
కలశపాథోనిధిసుధాంశుఁ డలరె విమత
ముఖపయోరుహములు గన ముకుళనంబు.

ప్రతనసుకృతాధిగమ్యంబు పావనంబు
పెరసి చరమాశ్రమము జగద్గురుఁడు పొలిచె
హంసముఖవంద్య మున్నత మన్యదుర్ల
భమ్ము పద మొంది యౌత్తానపాదిపగిది.

నేటుకొన ధాటి పాటల
శాటీసంఛన్నమూర్తి సంయమి తగె న
ప్పాటన కన సంజతటిం
బాటలజలదావృతహిమవత్కూటమటుల్.

శంకరుం డీతఁ డవుఁగాన శంకరుండ
కూల్చి యజ్ఞానగజము పైఁ దాల్చెఁ దదసృ
గాప్లుతము రక్తచర్మ ముద్యదరుణకిర
ణారుణోరుశాటీపటవ్యాజ మొలయ.

అరుస మెసంగ దండితకదధ్వాచయుండు జగద్గురుండు శం
కరుఁడు కరంబునం దపుడు కైకొనె దండ మొకం డవక్రమై
పరఁగెడునాత్మవర్త్మమున వర్తిలఁజేయఁగ నానజస్రభీ
కరపరవాదివాదపదకర్శిత యాశ్రుతినాజరద్గవిన్.

పిదపఁ జగద్గురుస్మృతనుతి
ముదితహృదంతరుఁడు ఘనుఁడు పుణ్యశ్లోకే
డ్యోదితప్రజ్ఞుఁడు యోగిజ
నదయితుఁ డను సదయత యతినాథునకు నిటుల్.

వేదచోదితధర్మమ్ము వెలయఁజేయు
నర్థి భారతీవంశవివర్ధనుండు
వ్యాసముని కూర్చి పేర్చినబ్రహ్మసూత్ర
ములను దమదారి కనుకూలములను జేసి,

పలికికొని అప్రమాణ
మ్ము లసాధ్వర్థములు భ్రష్టములఁ బొనరింపం
దలఁపడి రొక్కుమ్మడి స
ల్పులు కుమతాశ్రితులు నానఁ బోనాడి వడిన్.

అన్యథార్థగ్రహణనిగ్రహప్రవీణ
మననుకోష్యంబు సూత్రభాష్యంబు నీవ
వే రచించి మించుము పేర్మి విష్టపోప
కారకరణాత్తజన్మ అఖండతేజ!

తత్త్వవిత్తల్లజ! పురుషోత్తముఁడ వనుప
మానమహిమాన్వితుఁడవు ప్రజ్ఞానిధి వటు
గాన యత్నింపు మిపుడె జగత్సముద్ధ
రణమునకు ననవద్యసద్గ్రంథరచన.

భాష్యరచనము

అనుచు గోవిందయోగీంద్రుఁ డానతీయ
నాయితుం డయి శంకరయతివరుండు
తఱచి తఱచి వేదాంతదుగ్ధనిధి రుచిక
రమ్ము తత్సారసమ్మిళితమ్ము గాఁగ—

శర్కరాసుధాద్రాక్షేక్షుసారమధుర
రుచిరతరమృదులవచస్సముచితగతిని
నారచించెను సూత్రభాష్యంబుఁ దలఁపఁ
బదియు రెండేండ్లు పయిఁ బడు వయసునందె.

పొనరిచె నీశ కేనకఠముండకముఖ్యమ యామహానిష
ద్గణమున కష్టు భాష్యము బుధప్రతినంద్యము వంద్యమై చిరం
తనబలవత్ప్రమోహపరినాశన మూర్జిత మాత్మతత్త్వబో
ధనచణ మద్వయత్వసముదంచిత మిద్ధగుణప్రకాశముల్.

ఆరచియించి మించె సమరావనిఁ గృష్ణసముక్తముల్ మహా
భారతసారభూతములు పావనసూక్తుల కీడ్యభాష్యముల్;
దూరతరం బన త్తతి కనూనము శ్రీనరసింహతాపనీ
యోరునయోత్తరార్ధమున కొప్పెసలారెడువ్యాక్రియల్ దయల్.

అట్టు లుపదేశసాహస్రికాదికములు
గ్రంథము లమలతమములు వ్రాసె వేల
కొలఁది, నవ్వానిఁ గనుఁగవఁ గలనయేనిఁ
గన్న ముక్తుల యవువారు కలిని జనులు.

పారి సుమనోమనోంబురుహముల్ వికసింప నెలర్ప నింపి శం
కరరవి కీర్తిదీప్తిని జగమ్ముల నిమ్ముల మూలమూలలం,
బారసెఁ గువాదిఘూకపరిపూర్ణము లల్పమతిప్రణీతదు
ర్భరకలుషాంధతామసపరంపర లెల్ల లయంబు నప్పుడే.

శంకరుండు కూరిచినభాష్యము తెఱంగు
నాలకించి యాక్షేపణ మాచరించి
రథమపాశుపతాదిమతాభిమాను
లిస్సి శ్రుతిమతప్రతికూల మిది యటంచు.

అంత శ్రుత్యుదాహరణనిరంతరుండు
శంకరుండు వారి నవారి సాధువాద
భంజితులఁ జేసి యాత్మీయభాష్య మురుత
రశ్రవస్సంయుతము సుస్థిరము పొనర్చె.

రాజిలెఁ దదీర్ష్యమాణ మార్యపదభాష్య
మటు నిఘర్షణప్రచ్ఛేదనానుతాప
నాదివిధుల దాష్ట్య మొకింత యలముకొనక
మెఱుఁగుగఁ దొంటికంటెఁ బొన్నెట్టు లట్లు.

కానఁగరామిఁ గన్నుఁగవ కామతపంకనిమగ్నఁ గూర్మి పెం
పూన సముద్ధరించి మును యోగ్యుఁడు వ్యాసుఁడు నిల్పె నట్లు; నేఁ
డో, నిరవద్యభాష్యగతసూక్త్యమృతమ్ముల ధౌతపంకఁగాఁ
దా నొనరించి మించె యతితల్లజుఁ డా శ్రుతియన్ జరద్గవిన్.

ఎద్దానియొసఁగిన యెంతయు రుచ్యముల్
కృతిఫలలక్షణక్షీరధార
లాని యనామయ మందుఁ ద్రిలోకమ్ము;
లెద్దానికాఁపుర మెల్లవేళ
లధ్వరావహితులౌ నవనీసురేంద్రుల
నెలవుల; నట్టి ప్రాఁబలుకుగిడ్డి
కాలవశమునఁ బాఖండకరంగత
మై పంకపూర్ణ మహాకుతర్క

కుహరపాతిత యయ్యె; నకుంఠకరుణఁ
దత్సముద్ధృతి యొనరిచి తనదుభాష్య
వనధిసూక్తివీచికల జంబాల మెడలఁ
గడిగి పూతఁ గావించె శంకరగురుండు.

అప్రతిహతకవితాప్రవాహార్ఘ్యపా
ద్యముల, నుద్గ్రంథగంధార్పణముల,
శ్రుతిహితభాషణరుక్మభూషణములఁ
స్మృతివచోదీపసంవితరణముల,

ఖలవచఃఖండనామలమండనముల, న
న్యనృహితవ్యాపారహారతతులఁ,
బరమతనిరసనవసనమ్ములం, దద్వ
శీకృతివిష్టరసేవనముల,

స్వీయభాష్యప్రచారనివేదనముల,
స్వమతసంస్థాపనకుసుమాంజలుల, నధిక
భక్తియుక్తిఁ బ్రొఁబలుకునా బ్రహ్మసతిని
సరవి నర్చించి పేర్చె శ్రీశంకరుండు.

వెంట నంటెను బౌద్ధభిక్షువు తాఁచ, ల
భించెఁ గణాదునిమించుకూర్మి
లాభ మ్మలఁతి యెట్లొ, లలి భట్టపాదాదు
లార్యులు పదగమనానుకూల

పథముమాత్రము వినఁ బలికిరి, సాంఖ్యులు
దొలఁచిరి దుఃఖము దొరయ నెనరు,
తర్కాంగలారలు దక్కించుకొ నుసు
లోకమాద్రి మార్గంబు నోపి తెల్పి;

రివ్విధానఁ దెల్ప నెవ్వరు నోపని
బెడఁదలఁ బడి క్రమ్గువేదపురుషుఁ
గరుణ మిన్నుల మదినిఁ బరమేశుఁ బొనరించె
శంకరుండు లోకశంకరుండు.

చూతము గాఁగ నేర్చునెడ క్షోణిని నింబము; కుంద మానెడన్
భూతమహీరుహం; బుపమఁ బొందిన నుమ్మెత చంపకమ్ముతోఁ;
శీతపటీరభూరుహముచెల్వము నొందిన వంశముఖ్యముల్;
లాతులు గాంచి మించఁగఁ గలారలు శంకరసామ్య మిమ్ములన్.

కామకిరాతకార్ముకనికామజవాగతభీకరాశుగ
స్తోమవివిద్ధధైర్యజనసూత్రితదుష్టనిబంధబృందమం
దేమహితుండు శంకరయతీంద్రకృతిశ్రియణాప్రణష్టమో
హామలచిత్తవృత్తియుతుఁ డాదర మూను నబంధహమ్మునన్ ?

కురువిందాంకురతుల్యభవ్యతరవాగ్గుంఫంబులన్, బ్రోల్లస
త్సరసీజాతమరందబిందుమధురార్థస్ఫూర్తులన్, భూరిని
ర్జరభూమీరుహసూనగర్భవిలసత్సౌరభ్యగర్భధ్వని
స్ఫురణన్ శంకరభవ్యకావ్యతతి పొల్చున్ గెల్చు నన్యంబులన్.

తాదృశదేశికేశముఖదాంతసుధాబ్ధిజభాష్యచంద్రుఁ డే
వేదబుధామరప్రతతి కిచ్చి సుధారసమున్, మతాంతరా
పాదకతామసమ్ములు జనమ్మునఁ బాదతతిన్ విదిర్చి, స
మ్మోదితముం బొనర్చి తగె భూసురచిత్తచకోరవారమున్.

మహిత, మనాదివాగ్వనధిమంథనసంభవ, ముగ్రశత్రుని
గ్రహచణపండితామరనిరంతరసేవ్యము, భవ్యమై ముదా
వహము, నిమద్యతీంద్రకృతభాష్యసుధారస మానఁ గ్రోల న
న్వహ మజరామరత్వము మహోద్భుతవృత్తిఁ గరంగతం బగున్.

బుధమనఃకంజములు ఫుల్లములు పొనర్చి,
విమతతిమిరమ్ములన్ సుదూరమునఁ దఱిమి,
శత్రుకౌశికములచూపు సరగ నడఁచి,
సాగె యతిసూర్యభవ్యభాష్యప్రదీప్తి.

న్యాయమందరప్రమథితామ్నాయసింధు
జనితభాష్యామృతమ్ము నూతనము కూర్చుఁ
గేవలము విన్నయంతన జీవజాల
మునకు నమృతత్వ మిద్దాని ననఁగఁ దరమె!

విష్ణుపాదసంభూతయై వెలసె గంగ;
పరఁగె శంకరముఖజయై భాష్యసూక్తి.
ముంచు జగముల మొదటిది; మున్గియున్న
దీనుల సముద్ధరించు ద్వితీయ కరుణ.

అమ్మెయి భాష్యమ్ము నశో
ష్యమ్మును గూరిచి కెలఁకుల నద్దానిప్రచా
రమ్మున మొనయువినేయుల్
నెమ్మిం గని భగవదంఘ్రి నెనరుమెయి ననున్.

వత్స! స్థాపింపు మింక నద్వైతమతము
నప్రతిహతనిరూఢి ననంతఁ, బంత
మున నిను నెదిరించి జయించుమనుజుఁ డెవఁడు
నుండఁబోఁ డిష్ట వెడలు మాయొప్పిదమున.

చనుము మునుమున్న తనయ! ముమ్మొనలవాలు
దాల్పుదొరకు నావాసపదమ్ము కాశి;
కం దడు గిడుటె తడవుగ నప్పురాధి
నేత నించు నీవయి నెంతో నెనరు వింటె.

ఇమ్మెయి నానతిచ్చి పొనరించి పవిత్రునిఁగా గృపారస
మ్మిమ్ములఁ జిల్కఁచూడ్కి నురగేంద్రసరూపుఁడు యోగిచంద్రుఁడ
మ్ముమ్మొనవాలుదాల్పుదణిప్రోలికి నేఁగఁగఁ దొందరించె లో
కమ్ములపై నికూర్మి సురగణ్యుని శంకరు లోకశంకరుణ్.

### కాశీ ప్రయాణము

నీపపాదపవనానీపరీతసమీప
తలసమన్విత యయి యలరుదానిఁ,
గనదాపగాతీరకనకకల్పితరూప
యూపకోటుల వలనొప్పుదాని,
సగరసూతిజతపశ్చర్యావతీర్ణాభ్ర
సరిదంబుపూతమై పరఁగుదాని,
శర్వసర్వమయత్వశంసిలింగాపూర్ణ
బహిరంతరవనియై వఱలుదాని,

సకలభాగ్యైకరాశి, నిష్కాసితాఘ
రాశిఁ, గాశిఁ దఱిసి ప్రహర్షంబు వేల
మందె శంకరుఁడు కతిపయప్రయాణ
ములన మాఱట శంకరుపోల్కి మెఱయ.

ప్రబలశాత్రవపక్షబలహృతిదక్షుఁ డ
ఖండభైరవమూర్తి కాఁపుదారు;
ప్రత్యూహతిమిరమార్తాండుండు డుంఠివి
ఘ్నేశుం డభీష్టంబు లిచ్చుదాత;
ప్రకటకృపారసవర్షి మాధవుఁ డఱ
మఱలేని పైపరామఱికదారు;
ప్రథితద్వివిధఫలప్రదుఁడు విశ్వేశ్వర
స్వామి కేల్వట్టినవల్లభుండు;

ప్రాఁపు లటనట నలరుదైవతవిశేష
ము; లమృతరసప్రసిక్తాన్నపూర్ణపాణి
యన్నపూర్ణామహాదేవి యనుఁగుసవతి;
యంతియే కాశి సకలభాగ్యైకరాశి.

అన్నపూర్ణయె కాన స్వీయాధినేత్రి
యన్నపూర్ణల యవ్వీట నతివ లెల్ల;
రిడఁగఁబో రహంకృతియుతజనున కొక్క
పట్టెఁ డవ్వ్యాసునంతటివాని కేని.

అగ్గమా కామగ్రహమ్ము నొక్కమ్మడిఁ
జూపుటింగలమున నేపడంత్రు;
మఱ్ఱిమ్రానులనీడ మలసి నిచ్చలు శిష్య
బృందమ్ములం జదివించుచుంద్రు;

భూతిభూషితులు ముప్ప్రొద్దులు గంగాజ
లమ్ములను నవగాహన మ్మొనర్తు;
దరి నున్న పితృభూమిఁ దారయ కింతయు భీతి
లేయుంబవలు సంచరించుచుండ్రు;

ఘనులు తత్రత్యపూరుషు లనఁగ నింక
నఖిలదుర్గతిపతి జీవహరణరతుఁడు
ప్రబలదంష్ట్రికరాళుఁ డప్పాశి కెట్లు
కలుగనేర్చుఁ బ్రవేశ మక్కాశిలోన!

చేరి కాశికాపురిపొలిమేరలోనఁ
బ్రాణములు వాయ నున్నయేప్రాణినేనిఁ
దానె విశ్వనాథుఁడు శ్రుతిఁ దారకోప
దేశవశమున నాత్మసాత్కృతము సలుపు.

మనమునఁ దలఁచిన శతయో
జనదూరగుఁ డేనిఁ గాశి సద్గతి నెనయుం
గన నధికృతి వెలుఁ గగునే
చెనయఁగఁ దత్ప్రాణికోటి శివసామ్యంబుల్.

చెప్ప నొప్పు లాఁతిచిల్లరదేవళ్ళ
మహిమ మెల్ల నొక్కమాద్రి, తత్పు
రాధినేత విశ్వనాథులీల లెఱుంగఁ
జాలువాఁడ యెందు లేఁడు లేఁడు.

తనతప మ్మడఁగింపఁ దలకొన్నస్మరుఁ గంటి
కడిఁదిమంటన చెడ నడఁచినాఁడు;
తబిసిపట్టినిఁ బట్టి త్రాఁట లాఁగెడుపెద
దున్నరౌతును గాలఁ దన్నినాఁడు;
కన నేడ నెన లేనికడిమి నుద్రిక్తులు
పురరాక్షసుల వెన్నుఁ జఱచినాఁడు;
కడలిఁ బుట్టినభయంకరకాలకూటమ్ము
నెఱి మ్రింగి గలమున నిలిపినాఁడు;

బాణరక్కసిదౌరకోటవాఁకిటఁ బెద
కాఁపుగా శూలియై నిల నోపినాఁడు;
స్కందముఖ్యులఁ దనయులఁ గాంచినాఁడు;
పిశ్వరతౌపరుండు విశ్వేశ్వరుండు.

తనరె భగీరథాఖ్యనృపతల్లజతప్తమహాతపఃకురు
జ్జనితఫలంబు, యోగిజనసంస్థితియోగ్యనికుంజపుంజశో
భనతరతీరమేదురము, పన్నగరాడుపవీతధృజ్జటా
కనదురుమల్లికాసుమము, గాంగముతోయము శంకరేడ్యమై.

వెలితమ్మిరేకుల గెలుచుకన్నులవాని
పదనఖ మ్మొదవినపట్టు గాన;
తెలనాలదొరరౌతు తల ముడిచినపూవు
రిక్కఱేనితో చెల్మి చిక్కకతన;

గగన ముత్తుంగశృంగముల నంటెడుమంచు
మలనుండి యిలపయిం బడుటవలన;
వెలిబూతి మెయిఁ బూసి విశ్వనాథుఁ డెవేళఁ
జేరి మున్కలువెట్టుకారణమునఁ;

జేసికాఁబోలు జాహ్నవీజీవనంబు
కాశకర్పూరహారకీర్తికకార్తికేందు
కుందసుస్ఫాటికమ్ములచందమునన
నిర్మల మ్మతిశ్వేతమై నెగడనయ్యె.

తీయనిక్రొందేంట్లతేటపాటలఁ బుర
హరణాదికీర్తన మాచరించి;
నునుకరువలిసోఁకుడున యిటు నటు నూఁగు
తామరవిరుల నర్తనము సలిపి;
నీటిపుల్గులయార్పునీటుల లీలలు
వేనోళ్ళఁ బేర్కొని ప్రీతుఁ జేసి;
చిటిపొటితరఁగలఁ జటుకున నటు వచ్చి
చిక్కనియక్కునఁ జక్క నదిమి;

నురువుపరువుల నగవులమురువు సూపి;
నాచుతీవలఁ బ్రణయబంధములవిధము
వెలికిఁ బ్రకటించి; మించి యవ్విశ్వనాథు
మనసు హరియించు గంగమ యనుదినమ్ము.

వేలుపుజవరాండ్రవాలుచూపులజడి
నొదవినశ్యామిక యొక్కచోటఁ;
దన్మజ్జనోద్గలిత స్తనకుంకుమా
ద్యుదితపాటలత వేఱొక్కచోట;
నమ్మేలంతలమేలిసొమ్ము లేర్పఱచిన
యొక్కక్రొమ్మెఱుఁగు మఱొక్కచోటఁ;
దత్సుందరీబృందతనులతాసంగమా
భ్యుదితగౌరతయు నింకొక్కచోట;

నప్పడంతులకొప్పుల నమరియున్న
కల్పకద్రుమసుమములకమ్మతావి
యెల్లెడం బర్వఁ బర్వమై యెల్లవారి
కనుల కలరదె! యేటిగంగమవధూటి.

ఆవిమలధునినీటఁ గృతావగాహుఁ
డై జగత్సుఖంకరుఁడు రయంబ లేచె
శంకరుం డమలుఁడు సుధాసాగరమున
నుండి పార్వణామృతకిరణుండువోలె.

సరవిఁ దదమృతకణాహిత
వరరుచియుత మతనిమూర్తి భాసిలె హిమరు
క్కరగలదంబుపృషద్భా
స్వర మిందుశిలారచితము ప్రతిమముపోలెన్.

కొలిచి హరిసమభ్యర్చ్యముల్ కోమలములు
విశ్వనాథాంఘ్రికమలముల్ విశ్వవంద్య
పదుఁడు శంకరమస్కరి వారణాశి
నిలిచె నాలు గేఁడులు గడు నలర మనము.

## శిష్య సంగ్రహము

అమరినకాశికాపురిపయానపుదారిన డాసి ఘోరరూ
పము భవవార్ధికిన్ వెఱచి పాదములం బడి వేఁడువారి నం
ద్యమహిమములన్ సనందనకరాత్మకతోటకులన్ గ్రహించె నె
చ్చు ముదము కూర్చుశిష్యులుగ శంకరుఁ డర్థిసుఖంకరుండ వై.

అరుణకరాళి నబ్ధి యెటు లట్లు కుతర్కగణావిశోష్యమై
పరఁగుస్వభవ్యభాష్య మను పానక మాదట నొక్కనాఁడు సుం
దరముల స్వీయపాదనవతామరసమ్ముల దత్తచిత్తు లా
దరయుతులౌ కలార్థులకుఁ ద్రావఁగఁ బోసె జగద్గురుండు తాన్.

ఛాత్రహృత్పంకజార్కుండు శంకరగురు
వరునివచనామృతరసమ్ము భక్తిఁ గ్రోలి
తెలివి గని రడఁగ నబోధదీర్ఘరోగ
మా సనందనాదులు శిష్యు లమలమతులు.

అందు సనందనాఖ్యుఁడు శమాదికసద్గుణబృందసుందరుం
డంది యమందమా నియతి నందఱకంటె శ్రుతశ్రుతీందిరా
సుందరుఁ డయ్యెఁ దన్గొలువ సుష్ఠురహార్థవివిత్సు, డెంద మా
నందతరంగితమ్మ యయి నంద్యచరిత్రుఁడు శంకరుం డొగిన్,

ఉపనిషజ్జాలవిలసద్రహస్యార్థసార
పాత్రసూత్రభాష్యంబు త్రివార మతని
చేతఁ జదివించె నాతఁడుఁ జిత్తసీమ
నిలిపె నద్దాని మననంబు సలిపి నిష్ఠ.

పద్మపాదచరిత్రము

ప్రకటితత మ్మొనరింప నవ్యాజమైన
వానిగురుభక్తి గంగ కవ్వలిద దరిని
భాష్యముఁ గాపలె వెట్టు నవ్వాని బిలిచె
నాతురుఁడటు లొక్కతటి రమ్మ యటంచు.

అంత ముందు వెన్కయు నాతఁ డరయఁ బోక
వచ్చె బిరబిర జాహ్నవీపనముఁ గడచి;
ఘోరసంసారసాగరోత్తారకమ్మ
నదిని దాఁటింపదో గురుపదసుభక్తి!

అట్లు లరుగుదెంచుసనందునంఘ్రిపద్మ
ములు జలమ్మున మునుఁగక నిలుచునట్లు
లడుగడుగునకు నడుగున నట్టె యునిచెఁ
బద్మములు గంగ శతదళభాసురములు.

నాఁడునాఁగ నొగి సనందనుఁ డాతఁడు
పద్మపాదుఁ డనఁగఁ బ్రథితిఁ బడసెఁ;
దక్కుఁగలవినేయు లక్కరణిన సార్థ
కాభిధానకలితులై వెలసిరి.

పడసి విశ్వేశ్వరునియాన ప్రథితుఁడు గురు
వరుఁడు వారును వెంట రా బయలువెడలెఁ
గడఁగి విమతపంకప్రదిగ్ధముల దెసలఁ
గడిగి వైవ భాష్యామృత మడరఁజేసి.

భట్టపాదచరిత్రము

అనభిమతమతహంత, వేదాంతతతిర
హస్యసంవేత్త, శంకరయతివరుండు
కడఁగి నిర్జింప సాధితకర్మకాండుఁ
డాకుమారిలుఁ దొలుతఁ బ్రయాగ కేగె.

మలసి సితాసితమ్ములు నిమజ్జనముల్ పొనరించి మించు పు
ణ్యలతనువుల్ కళిందకుధరోత్తమనందనితో సమాగమం
బొలసి తొలంచి కిల్బిషము లున్నతముల్ పురుషార్థసంపదల్
లలి నొడఁగూర్చు జహ్నుమునినందని యొప్పగ నప్పురంబునన్.

చెలఁగుఁ గళిందనందని విచిత్రసవిత్రకృపీటపాత్ర క
న్నుల కొకవింతకాంతి తగ నూల్కొని జహ్నుభవాతరంగసం
క్షుల నుపరుద్ధవేగ మయి తోయము పాఱ నలంతినడ్కలం,
గలిసినక్రొత్తచెల్మి మదిఁ గల్గిన యట్టియుపత్రపంబలెన్.

సారెకు నేర్వ గౌరసరసచ్ఛవిసద్ధతి నొక్కదిక్కునన్
జేరినరాజహంసవరశిష్యులచే శ్రితతీర్థపాద; యే
పార బహూకరింపఁగఁ బ్రియామలతోడిదచెల్మికల్మి నా
వేరొకచో రథాంగపరివేష్టితయై యల గంగ రం గగున్.

ఏపరిపూతశైవలిని నే రవగాహనముం బొనర్తురో వా
రోపరు మర్త్యలోకమున నొందఁగఁ బుట్టువు, సౌఖ్య మందఁగా
నోపుదు రా దినంబునన; యొయ్యన నియ్యది తెల్పె వేద; మ
య్యాపగ యాపురిన్ విరచితాంతిక యై యలరారు నిచ్చలున్.

సలిపె నయ్యాపగాదివ్యసలిలమందు
న నఘమర్షణస్నాన మయ్యనఘమతులఁ
దామరసపద్రప్రముఖులఁ దనదుసనుఁగు
శిష్యులం గూడి వేడుక భాష్యకర్త.

సరవిఁ గల్హారవారరజస్సురభిళ
శీతలానిలభంగసంసేవ్యమానుఁ
డై సముత్తాలతరతమాలావనీరు
హాంచితము తటమున విశ్రమించెఁ గొంత.

"అరయఁ ద్రైలోక్యకర్మలయమ్మునందు
నలఁడు త్రిప్పిననిజయశోయంత్రధార
గమనజవవశమున జనిఁ గన్నవిస్ఫు
లింగములు సూర్యచంద్రులై నింగి కెగసె."

అని కొనియాడుచుఁ గడు యతి
జనాన్వయసుధాకరుండు శంకరగురుఁ డొ
య్యన రాఁ దనశిష్యులు వెం
టనె చనె భట్టార్యుఁ జూడ నడచి కడు వడిన్.

చిందునశ్రుపూరమ్ము జాలొల్కిందువదన
వనజములవారు శిష్యులు వనరుచుండ
భీకరతుషాగ్నికీలాప్రవిష్టు దహ్య
మానగాత్రు నా భట్టాభిధానుఁ గనియె-

అనుపమధూమసంవృతతుషానలకీలలఁ గాలి కాలిమం
దను వది తాల్పఁ బొల్పడినఁ దన్ముఖబింబము పేర్మిఁ ఘర్మవాః
కణగణదర్శనీయ మయి కంజముచాడ్పున నొప్పెఁ, దాత్త్వికుల్
వనటల నొందువారె తనులగ్నసుదుఃఖతరంగసంగతిన్?

కనదపాంగతరంగనిష్కాసితాఘ
నిచయు లోచనగోచరు నిగమదేశి
కేశునిన్ జ్వలనప్రతీకాశుఁ డీడ్య
పదుఁడు భట్టపాదుఁడు కని భక్తియుక్తి,

శిష్యసంయుతముగ నమస్కృతులు సలిపి
యనుః నదృష్టపూర్వ, శ్రుతమహాప్రభావ,
భవసరూప! నీపదములు పావనములు
కమలసఖములు గంటిఁ గన్గవ నటంచు.

తత్కృతనుతిముదితహృదంతరుఁడు భువన
శంకరుఁడు శంకరుఁడు వాని సరసరుచిర
వచనరచనసుధారసవర్షణప్ర
శమితభవభవతాపభాస్వరుఁ బొనర్చి,

విమతజనగణాశోష్యంబు స్వీయసూత్ర
భాష్యముం జూపెను భట్టపాదసుధికి;
వసుధ నమలంబ యయ్యు నిబంధమునకు
సార్థకత మెచ్చినపుడె కా యన్యబుధులు.

కనుఁగొని కొనె మోదంబును
జనవినుతుఁడు భట్టపదుఁడు; సర్వజ్ఞులు కాఁ
జనుదురె మత్సరతాభా
జనములు భ్రష్టాత్ము లల్పజనములు తక్కన్.

అనియె సుధి యిట్లు: నీదుభాష్యంబునందుఁ
బ్రథమ మధ్యాయమునయందె వార్తికమ్ము
లలరు నెన్మిదివే; లవి లలి రచించు
వాఁడ నీదృక్షు దీక్ష పైఁ బడకయున్న.

పూజ్యపద ! భవాదృశపుణ్యపురుషచరణ
సరసిజద్వయభవ్యదర్శనము దుర్ల
భంబు నిక్కువం బన, నేల వాకొనంగ
నిట్టియవసరములమాట నింక వేఱె !

లలి ననఘా! అమోఘఫలలబ్ధి విభాసిలె మత్పురాకృత
మ్ములు సుకృతమ్ము లెల్ల నవపుల్లపయోరుహామిత్రముల్ పద
మ్ములు భవదీయమ్ముల్ మృదులముల్ నయనద్వయగోచరమ్ములై
యలరుట; నీతుపాగ్నిభవమా తనుతాప మపాస్తకల్పమే.

సారసుదూరఘోరతరసంసృతిసాగరగర్భవీచికా
వారనిమగ్నమానవజనపారతలావనసాధనంబు మి
త్రారివిచారదూరులు మహామతు లూర్జితు లౌ భవా
దృశోదారులపాదపద్మములదర్శనభాగ్య మ దొక్కఁడే కదా.

కడచి చనెం ద్వదాగమనకాంక్షన కాల మనంత; మింతకుం
బొడ వయి పూర్వపుణ్యము అపూర్వమహామహిమాఢ్య నీద్యు ని
బొడఁగని జన్మసార్థకత పొందఁగ నైతి వినీతవృత్తి చొ
ప్పడఁ; బడనున్న నన్ను భవవార్ధి సముద్ధరియింపు మింపుగాన్.

భవదీయ మురుచరిత్రము,
పవిత్ర మీబ్రహ్మసూత్రభాష్యవినిర్మా
ణవిధాన మాలకించి అ
భవప్రతిమ! కంటి ముద మపారము మున్నే.

ఇరువదియేండ్లప్రాయము పయింబడునంతకె పూర్తిచేసితిన్
గురుపదసేవ లేమలుక, కొంటె: దదానతిఁ, బూని కాశికా
పురి కరుదెంచి వాక్కలహముం గొని బౌద్ధుల సారనాథులో
నిరువదివేవురం గెలిచి యెంతయు నిల్పితిఁ గర్మకాండమున్.

యతికులసోమ! ప్రయాగమ్మునం దొక్క
యాశ్రమరాజమ్ము ననువుపఱచి
కొని నే విధేయులకు వినేయులకుఁ గర్మ
పథమును దెలుపుచు వాసముంటి.

ఊఁకనిప్పునఁ బడుటో, నీటఁ జొచ్చుటో,
భృగుతటమ్మునుండి పృథివిఁ బడుటొ,
తమి మహాప్రస్థానగమనంబొ, మునుకొని
తనువుఁ బాయుట ధర్మతత్పరునకుఁ

దప్పి చనఁగరాని ధర్మవుకావున
నెమ్మి నీతుషానలమ్మునందుఁ
జొచ్చినాఁడఁ బెఱిమ హెచ్చినాఁడ నివేళ
నిన్నుఁ గనులఁ గాంచునియతి మెఱసి.

తనరఁగ బూతి సేసి విమతమ్ములపేరిటిపుచ్చుపుల్లలం
దనదుగభీరవాదదవదాహమహార్తరకీలలందు, స్థా
పన మొనరించి మించ నిల ద్వైతవిభిన్నము వేదమార్గ మె
య్యన జని గన్నపన్నగవరాభరణుండవు నీవు శంకరా!

అట్టి నీచేత గ్రథితమ యయినభాష్య
మునకుఁ జిత్రించి వార్తికమును బిరాన
జన్మసార్థక్యమును గనఁజాలునియతి
సందలేనైతి, నెంతయు ననద నైతి.

మండనప్రస్తావము

జగతి నద్వైతమార్గప్రచార మొకఁడ
యేని నీయభీష్టము నడి నేఁగు మింకఁ
బ్రథితు మాహిష్మతీపురావాసు విపుల
కీర్తియుతు మండనాహ్వాయు గెలుచుపనికి.

వైదికమార్గతత్పరుఁ డపాస్తభవాదరుఁ డుత్తముండు సం
వాదిభయంకరుండు గృహివర్యుఁ డతండు ప్రవృత్తిశాస్త్రజా
తాదరవృత్తిఁ గర్మపథ మాదట బోధనసేయుచుండు, నే
వేద నివృత్తి శాస్త్ర మతిహేయ మటంచుఁ దలంచు నెమ్మదిన్.

వెలయు నాతఁడుం బేర నుంబేకుఁ డయ్యు
సకలసుకలారహస్యవిన్నికరమండ
నుండకాన మండనుఁ డనఁ; బండితేడ్యుఁ
డతఁడు కారణజన్ముఁ, డాయతయశుండు.

అనఘధిషణ! యవ్వానియర్ధాంగలక్ష్మి
పేర నుంబేక, సతి, మహోదారచరిత,
వేదవేదాంగవేత్త్రి, ధీవిపుల; యాపె
కైవసమ్ము లష్టాదశకళలు వింటె.

అమ్మానవతిన్ మాధ్య
స్థ్యమ్మున కొడఁబడఁగఁ జేసి యమ్మండను వా
దమ్మున నిర్జింపుము. విజి
త మ్మా నుమ్ము జగ మెల్లఁ దద్విజయమునన్.

కర్మందిబృందచంద్రమ!
శర్మదముల్ తావకీనసద్గ్రంథములన్
నిర్మింప వృత్తు లాగమ
మర్మాభిజ్ఞ నియమింపు మండనుఁ బేర్మిన్.

నీరూపము యోగిమన
స్సారసభాగ్యంబు నిగమసారంబు భవో
త్తారము జితశతమార మ
కారణకరుణాస్వభావ! కనుఁగవఁ గనుచున్.

సలుపుదుఁ బ్రాణత్యాగము
నిలువుము నాయెదుట నెఱయునెఱిమెయి ననఁ జూ
డ్కుల వరకరుణారసధా
ర లవారిగఁ బర్వ నుర్వరాగురుఁడు రహిన్ —

అమలముఁ దతసుఖప్రకాశాత్మకమ్ముఁ
దారకబ్రహ్మమునుం దెల్పె వారణాశి
విశ్వనాథుఁడువోలె మై వీడనున్న
భట్టపాదున కాదట భవము సమయ.

### మాహిష్మతీప్రయాణము

భట్టపాదుఁడు నుడివినయట్లు లోక
గురుఁడు శంకరమస్కరికులవరుం డ
ఖండతేజుని మండనపండితప్ర
కాండు గెలువఁ దన్నగరోన్ముఖుండ యగుచు,

వెడలి గంగాతరంగపవిత్రితము ప్ర
యాగ మెట్టులో త్యజియించి, యనుసరింప
ననుఁగుశిష్యులశోష్యధీఘనులు త్వరిత
గమన మమరఁగ సరిగి వేగమున బ్రోల—

అతులితనూత్నరత్ననివహాతివిచిత్రితశుభ్రభవప్రశో
భిత మతసీసుమప్రతిమభిత్తిసమున్నతసౌధసత్సుధా
ద్యుతిధవళీకృతామృతమయూఖము మండనపండితాభిమం
డితము పురంబు కన్గొనె మునిప్రవరుం డరుసం బెసంగఁగాఁ.

తవిలి ప్రఫుల్లమల్లికశతచ్ఛదరమ్యరమాసుపద్మప
ద్మవనవిహారధీరము ముదంకర మూర్మివినిర్గలత్ప్రప
న్నివహసుశీత మేజదలినీమృదులస్వనవాహ మిందుజా
పవనము శంకరుం గొలిచి వాసినిఁ గాంచె శ్రమాపహంబ యై.

సలిపి యవగాహ మానదీజలములందు
నాహ్నికముఁ దీర్చి పేర్చి యయ్యతివరుండు
చండకిరణుండు బిరబిర స్వస్తికావ
ద మధిరోహించి రహియించుతరుణమంద-

వంద్యచరణాఢ్యమండనపండితప్ర
కాండమండితసదన ముద్దండవృత్తిఁ
జేర నరుగుచు వెంట రా ధీరధిషణు
లనుఁగుశిష్యులు మార్గమధ్యమ్మునందు—

చంకలం బెట్టి బిందియల్ పొంక మెసఁగ
జలముఁ గొనిపోవ రేవరేవులకు వెలలు
నీలచికురల మండనునెలవువరవు
కత్తెలం గని సువినీతవృత్తి ననిరొ.

నిండునెఱిం దెల్పుఁడు ప్రో
ద్దండవచోవిలసితుండు తతసంఖ్యావ
త్కాండాఖండలుఁ డౌ నా
మండనమిశ్రాఖ్యుఁ డుండుమహితభవనమున్.

ఈగతిఁ బ్రశ్నించిన నెల
నాగలు వారలును మీఱి నందితస్ఫూర్తి
శ్రీగరిమమ్మున నయ్యతి
కాగారవ మిరవుకొనఁగ ననిరీసరణిన్.

ఫాలతలాంబకోపమ, ప్రభాజితతిగ్మమరీచి! చూచితే,
తాలమహీరుహోచ్ఛ్రితము ధాతృపురోపమితంబు గోపురా
ట్టాలకశోభితంబు ప్రకటస్ఫటికద్యుతిసంతతంబు వి
విద్యాలయసంజ్ఞితంబు నిలయం బొకఁ డల్లదె కాననయ్యెడిన్.

రంగగుఁ బాఠశాలలు కరంబు తదంతరభూమి నెన్నొ. ఉ
ప్పొంగ మనంబు మండనుఁడు పొల్చు వితర్దికపై నిషణ్ణుఁడై
యంగసమన్వితంబులు కలార్థులకున్ నిగమార్థసారముల్
సంగతి బోధసేయు ననిశంబును నంబుదనిస్వనంబునన్.

ఆపాఠశాలవెనుకన
యేపారున్ మండనార్యుఁ డెడఁద దలిర్పం
గాఁపుర ముండెడుభవనం;
బీపుడమిం గనము దాని కీడవుదానిన్.

రంజన మేర మీఱఁ బురరథ్యల వచ్చుచుఁ బోవుచుం సువా
రిం జడిపించు గెల్పుఁ డెదిరించి మముం, గొని కాపిలమ్ము పా
తంజలమేని మీ, రనుచు ద్వారనిబద్ధవిశుద్ధరుక్మరు
క్పంజరసంస్థితిం బెరసి మాటికి మాటికిఁ గింకిరాటనుల్.

సారసదృక్తతుల్ సలుపు సామముగానము పంచమస్వరో
ద్గారిగలంబులన్; ఋగవధాన మొనర్చును గీరశారికా
వార; మథర్వపాఠపరిపాటిఁ దగున్ మొదవుల్; యజుస్సు నే
పారఁగ వల్లెవెట్టు నెపు డాఖువు లాతనియింట జంటలై.

'కర్మమె మూలసాధన మఖండము బ్రహ్మపదాదికంబునౌ
శర్మము నొందఁ' 'గా దటులు, సంసృతిబంధము రూపుమాప దా
కర్మము తెచ్చి వెట్టు, లలిఁ గల్గ దరక్తియు' యంచు నొండొరుల్
పేర్మిని బోరుచుండు వలభిప్రతివాసికపోతపోతముల్.

'కన స్వతఃప్రమాణం' 'బటు కాదు కాదు,
వినుము పరతఃప్రమాణంబ వేదజాల'
మంచు వానిగీమున వివదించుపలుకు
పులుఁగులకు బదుల్ వలుకువాఁ డిలఁ గలండె!

అనునవ్వానితాప్రత్యు
క్తినవసుధాస్వాదమున ముదితమానసుఁ డై
చనె నయ్యతి తత్తల్ల
క్షణసంలక్షితము మిశ్రసదనంబునకున్.

కని పొసరిచి యాచమన
మ్మనితరసామాన్యధీసమన్వితుఁ డమ్మం
డనపండితుఁ డమ్మునికుల
వననిధితుహినాంశు నర్ఘ్యపాద్యాదులచేన్,

పారి నర్చించి తలిర్చిన
యరుసమునన్ వేఁడె మత్సమర్పిత మత్యా
దరపూర్ణము భైక్షము స్వీ
కరింపుమా యంచు; నంతఁ గర్మంది యనున్—

వా ద భి క్షా ర్థ న ము

అరుగుదెంచితి వాదభిక్షార్థి నై భ
వత్సకాశమ్మునకు నిమ్ము వడి నదియె ప
రస్పరచ్ఛాత్రతాపణరాజితముగఁ,
గలుగ దాదర మితరభైక్షమ్ములందు.

వేదశిరఃపథంబు భువి విస్తృతముం బొనరించుపొంతె నొం
డేదియు లేదు నాకుఁ దమి యింతయు నిక్కువ; మధ్వరాదులం
దాదర మూని మాననమునం దది త్వత్పరిభూత మయ్యె; నేఁ
డాదట నిన్ జయించి విమతాశ్రితు, దాని సముద్ధరించెదన్.

కావున వేదమార్గ మవికల్ప మనల్పము మామకీన మెం
తే వినయ మ్మవుర్వ గ్రహియించి సుఖింపుము; కాదయేని ని
ష్టే వివదించి గెల్వు; మటు డీకొననేఱవయేని నోటమిన్
భావననేసి తెల్పు మొగిఁ బాఱులు వీరలు నాలకింపఁగాన్.

అన విని యాత్మగౌరవసమాస్థితుఁ డిద్ధయశోన్వితుండు స క
ర్మనికరదత్తచిత్తుఁ డతిమర్త్యచరిత్రఘనుండు మండనుం
డు నవపరాభవంబునఁ గుముంగడుఁ గంపము నొంది కుందు చి
ట్లనుఁ గని దేశికేశుఁ బ్రశ్రయాంబుదగర్జల గెల్చునెల్గునన్.

ఎదిరి శతాస్యుఁడే యయిన నెప్పుడు నొప్పఁగఁ బోవఁ డోటమిన్
విదితనయుండు మండనుఁడు వేదవిదగ్రణిగాన; వాని య
మ్ముదుసలి వ్యాసమౌని పరబుద్ధివి నీవును గూర్చినట్టి దుః
ఖదమవు క్రొత్తమార్గమునఁ గాలిడ నిప్పు డతండు వెఱ్ఱియే?

సకలకలాప్రపూర్ణుఁడు నిషత్పరివేత్త బుధకృపాకరుం
డొకఁడు జనించి, నించు నిల నోలి నవేలము లాత్మకీర్తిచం
ద్రిక; లల వానితోఁ బోరయుఁ దీవ్రవివాద; మటంచు మించు కౌ
తుకమున నున్న నన్ దటిసెఁ దోడన నీజయ మబ్బురంబుగాన్.

మన కవుఁగాక నింక నసమాన మనూనము వాద; మాదటన్
మొనకొనుగాక సార్థకత పుష్కలశాస్త్రపరిశ్రమంబు; పం
బినతమిఁ దాఁ దనంతన సమీపసమాపగత మహా సుధారసం
బును గొనఁబోఁడె స్వాదుతమమున్ వసుధావసథుండు మస్కరీ!

ఆరయ కిమ్మనందు కలహ మ్మిటు దుర్హృదయస్మయాటవీ
ఘోరకుఠారధార యతిగూఢ మకుంఠ మధీతశాస్త్రదు
ర్వారము మామకమ్ము చతురత్వము నీశ్రుతికర్తగోచర
మ్మై రహి మీఱ దెన్నఁడును యత్యధిపా! యడఁగింతుఁ బంతమున్.

ఇంతగఁ గోరగావలెనె యిమ్ము వివాదము భైక్ష మంచు? వి
న్నంతన దానిఁ బూనితి హృదంతరమందు; నమంద! యుండి యే
నెంతటికాలమో వివదియింపఁ గుతూహల మందుచుంటి; రాఁ
డింత కొకండుఁ బండితజనేడ్యుఁడు కాన నెచోట దీటమై.

పోరి వివదింతుఁ బంతమునఁ; బూర్ణవిదగ్ధత గెల్తు నిక్క మ
య్యురిధరుపాన్పు నేనియు; జయాపజయంబులు నిర్ణయించు నే
ర్పరి యొకఁ డుండఁగావలయు వాంఛిత మాట జయం బమోఘ మి
ర్వ్వర; కటు గాక యున్నఁ బొలివోవదె పోరు శ్రమైకలాభమై.

వాదమునన్ వాదిప్రతి
వాదులు కొందురు విపక్షపక్షము; లస్మ
ద్వాదమ్మునఁ బణ మేదో,
యేదో ప్రమాణము, స్వభావ మేదో చెపుమా.

వినుమా, గృహివర్యుఁడ నే,
ననఘాత్ముఁడ వీవు యతిజనాగ్రణి; వస్మ
ద్ఘనవాదమ్ము లొనర్పుము
పణయుతములు, నిర్ణయింపు పాక్షికవిభునిన్.

కనె జని యన్వర్థత ముని
వినుతుఁడు కర్మంది వాదభిక్షార్థియ మై
చనుదేర; నెల్లి వాదము
పొనరింత మటన్న యతివిభుఁడు నీకొనుచున్—

### భారతీమాధ్యస్థము

కూరుచుచెలి నీకు భారతి మాఱట
భారతి నొగి మధ్యవర్తినీత్వ
మునన నిలిపి వాదమున మొనయు మటన్న
నుల్లసిల్లి మిశ్ర వల్లె యనియె.

### సూర్యాస్తమయము

కాఁగల దభూతపూర్వ మఖండవాక్క-
లహము మండనశంకరులకు నటంచు
నెల్ల జగములుఁ దెలియఁ జాటింపఁ బూనె
ననఁ బులుంగులారుపు లంటె నాకసంబు.

వత్తుఁగాక యెల్లి రయమ్మ బ్రహ్మశంక
రానువాదము లీ గృహియతిపతులకుఁ
బొరయుబో ర్విన నని బిరబిరఁ బ్రతీచి
జలధిఁ బడె దివాకరుఁడు సస్యందనముగ.

అఖిలగురుఁడు శంకరునిమాహాత్మ్య మెఱుఁగఁ
జనక పదరుదె మదమున ననుచుఁ గినుక
చెనయఁ గను లెఱ్ఱసేసి మండనునిఁ గనియెఁ
బ్రకృతి సాంధ్యారుణద్యుతివ్యాజ మొలయ.

అనుమానమ యివ్వాద
మ్మునఁ గార్ష్ణ్యమ ఫలము వదనమున నీ కని నే
ర్పునఁ దెల్పఁగ మండనగృహా
మును గ్రమ్ముచుఁ బర్వెఁ దమము భువనములందున్.

మండన ! తావకీనముఖమండల మెల్లి కనంగ నో మహో
ద్దండయతీడ్వివాదవిజిత మ్మయి యిట్లు కళంక మొందె; వే
ముండితమై శిరమ్ము నునుపుం గను; రక్తము చేల మబ్బు మై
నిండ నటంచు నాఁ బొడిచె నింగిఁ గళంకి యలంతి కెంజిగిన్.

కందునో లేదో మరల నీచందమునన
యాత్మసము వీని నా సందియమునఁ గానఁ
బరుగుఁ బరుగున సరుదెంచె భార్గవుండు
మండనునిలుసూటిగ వియన్మార్గమునన.

సానవెట్టె రాతిరి తా నిషత్తు లఖిల
కలలతో శిష్యయుతుఁడు శంకరుఁడు; సనునె
సుప్తి, తెమ్మని మండనసుధిని మేలు
కొలిపె ననఁ బుల్గుఁగార్వులు సెలఁగె దెసల.

సూర్యోదయము

పారె వెలిజిగి కెలఁకుల; దూరె నిరులు
ఘోరగిరికందరమ్ముల; దారెఁ దార
కాస్ఫురణము లలిని; మీఱె గగనమరుణ
దీప్తిఁ; జేరెఁ బ్రాగ్గిరి సప్తసప్తిరథము.

ఔదర్పమున నేర్పునన్ గడపి లోకారాధ్యుఁ డారావిరిన్
వేదాంతార్థవిచారతత్పరత నంతేవాసియుక్తుండ డై,
యాదిత్యోదయమంద తీర్చి దినకృత్యంబుల్ రయంపుంగతిన్
వాదౌత్సుక్యము నిండ మండనునియావాసమ్ముఁ జేరం జనెన్.

అట్లు చని చతురాశాసమాగతబుధ
మణిగణాలంకృతము సభామధ్యమందు
మందు నిగమవైముఖ్యమన్ మాన్కి యతి
బృందమణి శంకరుం డుపవిష్టుఁ డయ్యె.

సకలసుకలావిశారద శారదాస
రూప రుచిరసల్లాప కూరుచునెలంత
తనకు ద్వయవాణి మధ్యవర్తినిగ నిలిపి
సలుప వాద మాయత్తుఁడై పొలిచె మిశ్రు.

పారిఁ బతిదేవతామహిత భూరిగుణాలయ పొల్చె నెంతయున్
సరసవచోవధూటి నిజనాథసదస్యనియుక్తయై మహా
త్తరమవు వేదవాదమునఁ దద్విబుధద్వయతారతమ్యముం
ద్వరగ నెఱుంగ వచ్చినవిధాతృనిమానినిరీతి నాతటిన్.

శంకరమండనుల ప్రతినలు

పదపడియు వానివాదసంభ్రమ మసమము
దెలిసియె వరావరజ్ఞుఁడు దేశకేళి
తృఁడు పరావరైక్యపర మ్మతివభయద
మాచరించె శపథము స్వీయమ్ము సరవి.

అలరుంబో, పరమార్థసచ్చిదమల మ్మా బ్రహ్మ మొక్కండ; భా
సిలు విశ్వాత్మత నజ్ఞతావృతమ యై శ్వేతాకృతిఁ శుక్తి యు
ట్టులు; తద్జ్ఞానముకల్మి బ్రహ్మ మవుఁ; గూడుఁ ముక్తి సత్యంబు వి
శ్వాలయప్రాప్తిఁ; బ్రమాణ మిందు నిగమవ్రాతంబు పూతంబు సూ.

ప్రమదాసక్త! జయింతు నీదృశమువాగ్వాదమ్మునం దింత ని
క్కము వేదమ్ములయాన నేన; యటులం గాదేనిఁ గైకొందు జం
దెము నందమ్ములు పుట్టముల్ కుఱులు నర్థిం బాసి యియ్యంతిమా
శ్రమముం; దెల్పును గెల్పు నోడును భవచ్చార్వంగి వాయోడకే.

అన విని మనమునఁ జెనయఁగఁ
గన లెంతయు మండనుండు కర మెత్తి రయం
బునఁ బొనరిచె నీ తెఱఁగునఁ
ఘనతరశపథము సదస్యగణము వినంగాఁ.

అరయఁ గార్యచయాసముపేత యా
శక్తియ లేమి లేశమ్మునేని
నలరుఁ జిదాకారుఁ డప్పరమాత్మయం
దప్రమాణము లయి యాగమములు;
చెలఁగు వాక్యగమితాశేషకార్యసమూహా
మునకు మానముగఁ దత్పూర్వభాగ;
మమరుఁ బ్రసిద్ధశబ్దావళికిం గార్య
మాత్రమునన శక్తి; మహితకర్మ

మార్గమునన యఖండాపవర్గలబ్ధి
నిగమసమ్మత మటుగాన నిఖిలజనులు
నాచరింపఁగవలయుఁ జు మ్మనుచుఁ బాయు
నంతదనుకఁ దత్కర్మము లధికనిష్ఠ.

ఇదె మద్వాదము, విజయము
మదీయము, యతీంద్ర! కానిమఱునిముసమునఁ
వదలియ గార్హస్థ్యముఁ గొం
దుఁ దురీయ మ్మాశ్రమమ్ము దుడుకు లిఁ కేలా ?

అంత జితుఁడు జేత యనుఁగుగురుండుగ
నగుఁ గొనంగ నెదిరియాశ్రమ మను
నియమ మూని డిగిరి నిగమవాదమున భా
రతియనుజ్ఞఁ బడసి. రమణి యాపె——

వాఁడు నేవానిమెడ నిది, వాఁడు నిర్జి
తుం డనుచు మాలికాలంకృతులఁ బొనర్చి
పేర్చి యప్పండితేద్యుల వేగ మేగె
లోనికిఁ గృహకృత్యముల్ పూని తీర్ప.

అట్టు లన్యోన్యవిజయసక్తాత్ము లై వి
వాద మొనరించి మించి రప్రతిహతచరితు
లతికుతుకమునఁ గన విన నంబరస్థి
తిం దలిర్చె బృందారకబృంద మెల్ల.

శంకరమండనుల వేదవాదము

ఆఁకె సదస్యలోకకృతహర్షనినాదము స్వీయపక్షసా
క్షీకృతసర్వవేదము నికృత్తవిపక్షవివాదభేద మ
స్తోకయశోద మా గృహియతుల్ ఘొనరించువివాద మప్డు ని
ర్మోకకనన్నిలింపగణమోదద మాత్మవినేయభీదమై.

అలరెఁ గడుంగడుఁ దినదినాధిగతాత్మవచఃప్రకర్షముఁ
లలి విపులీభవద్విబుధనాథకులాధిపసన్నికర్ష మా
కలితకలానువర్షము స్వకర్తృకశత్రుజయేచ్ఛుతర్ష మి
మ్ముల నుపరుద్ధమర్షము నపూర్వ మవార్యము వాద మేదనై.

లేక మఱొండువిచారము
వే కొని తద్వశగచిత్తవృత్తియ వింజం
బాకిడినట్లు సభాస్థా
నీకము కనుఁగొనఁగఁ బోరి నెగడిరి వారల్.

ఇమ్మెయి దినవిధు లాహా
రమ్ములసమయమ్ములే విరామమ్ములుగా
నమ్మండనమానులు తల
దిమ్మన వివదించి రెన్నొ దినములు వరుసఁ.

పెరయరైరి ఖండితముల్ ఘొనరుచుచుం బ
రస్పర మ్ముత్తరమ్ము లా బ్రహ్మశంక
రానువాదము లొకనాఁడయేని స్వేద
కంపగగనేక్షణాదివికారములను.

## మండన పరాజయము

ఇమ్మెయిఁ దత్శ్రుతిస్మృతి
సమ్మత మప్రతిమయుక్తిసహిత మ్మతిపా
ర మ్మమ్మస్కరివాగ్గుం
ఫమ్మున కచ్చెరు వెనసి సభాసదులు కనన్,

ఎలయుడు మ్లానత మండన
గలవిలసత్ప్రసవమాలిక, యిరువురఁ గరం
బలర సరసవాణి వెసం
బిలిచె సరసవాణి లెండు భిక్ష కటంచున్.

ఈనెటిఁ గని యోటమి నది
యేనాఁడును నిదుర నేని యెఱుఁగనిసూరీ
శానుఁడు మండనుఁ డవనత
మాననమున బదులువలుకఁ డరనిముసము తాన్.

## మండనకృత శంకరస్తుతి

మండనుఁడు బుధేణ్మండల
మండనుఁ డభిమాన ముడిగి మస్కరిమణికిన్
దండప్రణామశతము ల
ఖండమ యథా భక్తియుక్తిఁ గావించి వెసన్,

నిటలతటీఘటితాంజలి
పుటిమై నమితోత్తమాంగభూయిష్ఠత న
న్నిటలాక్షసదృశుని యతి
నిటులు నుతించె నచటిబుధు లెల్లరు నలరన్.

అరయ జగత్ప్రసూతివి నిరస్తసమస్తసమున్నతత్వభా
స్వరుఁడవు బోధమాత్రతనుశాలివ యయ్యును మాదృశాబుధో
త్కరపరిపాలనాభిరతిఁ దాల్చి తలిర్చితి విట్టిరూప మం
చరసితి నిష్ఠ నీకృప ననంతగుణా, యతివంశభూషణా !

అనఘ! త్రయీశిరోభ్యుదిత మైన యనూనపదమ్ము తత్త్వమ
స్యనుపెనుఖడ్గముం గొని దయామతి నోమకయున్న నీవ పృ
థ్వి నిలువ నేర్చి పేర్చెడిదె వేగమ సౌగతదుష్ప్రలాపభీ
జనకతమిస్రకూపమునఁ జాలునఁ గూలి లయమ్ము నొందకే?

అరయన్ స్వప్నమునందు డస్సి కను సౌఖ్యం బంది పై నిద్రఁ గ్ర
మ్మర మేల్కాంచి సుఖించుమూఢజనుఁ డాత్మం బొల్చి తే జాగర
త్వరతిన్ నిక్క మటంచు నెంచుగతి ముక్తత్వం బనం బల్కు న
శ్వరలోకాంతరలబ్ధియే యని జడవ్రాతంబు మోహావృతిన్.

పరగురు ! త్వన్మృదుపదతా
మరసాహితచిత్తవృత్తిమహితులు మాయా
వరణవివర్జితు లవుటం
బరిహాస మొనర్చుచుంద్రు వారలఁ గనినన్.

కలనైనన్ విను భేదవాదిజనతో క్తన్ విముక్తి నుంకింప నేఁ
దలఁపంగా; నది లబ్ధ మైన భవబంధచ్ఛేద మేనాఁడునుం
గలుగంబోదు; భవత్ప్రణీత యతిముఖ్యా! తత్స్వరూపంబు వా
క్కులకే నందఁగ నీదు, తా దయమెయిం గూర్చుం బరానందమున్.

పూనిక హెచ్చ వచ్చెఁ గని మున్ను మహాబలసూతి విష్టపే
శానునెలంత రక్కసులచానలమధ్య వనర్చుదానిఁ దా;
రాణ నవిద్య నా గడుసురక్కసి మ్రింగినయీశు బొజ్జ న
ద్దానిద వ్రచ్చి తెచ్చితివి త్వన్మహిమంబు ననంగ నేరికా?

అతితరతేజ! పూజ్యకపిలాంబకపాదకణాదనాదు ల
ప్రతిమమనీషు లెల్ల శ్రుతిభావవినిర్ణయమందు నొందుచుం
ద్రతులము మోహ, మట్టియెడ, నన్యుఁ డెవండు నరుండు నేర్చుఁ ద
త్కృతికి శివాంశమో యన క్షితిం జనిఁ గాంచిన నీన కాక తాన్.

అమృతంపుంసోనఁ జిల్కు కుల్కు భవదాస్యాబ్జప్రరోహన్మహో
త్తమవాగ్జృంభణరశ్మిపుంజ మిటు లేదన్ వ్యాప్తకాష్ఠాంత మై,
యమి! నేర్చున్ భువి నూఁదఁ జిత్తమలినత్వాపాదకమ్ముల్ సుదు
ర్దమముల్ గౌతమకాణభుజ్ముఖవచస్తామిస్రముల్ పాదముల్.

అవలిప్తుల్ ఖలు లీశదూషకులు మాంసాహారు లల్పజ్ఞు లా
యవనాధీశులఁ గొల్చి నీల్గుఁజడపూర్ణానంత యేడా? యిఁకే
డ విముక్తత్వము? నా భయం బెనయఁ జూడ న్వచ్చుటన్ దా త్త్వికుల్
భవరూపా! నినుఁబోలుశంకరు లిలం బ్రభ్వస్తపాపాంకురుల్.

అలరఁగల వెట్టు లలుపులవ్యాఖ్య లనెడు
విసముతాల్పులకాటుల బిద్దనున్న
యాగమము లాత్మవిధృతాశయత భవద్వ
చోఽమృతప్రసేకమ్మున నేమఱునెడ?

యతితిలకా! నికామము భయంకర మా భవతిగ్మరశ్మిర
శ్మితతిభవమ్ము తాపము శమించి రహించెడిదే ప్రచార మా
యతము త్వదుక్తసూక్త్యమృతహస్తసుహస్తకృత మ్మ దెల్లచో
నతుకకయున్నఁ గ్రన్నన మహార్తి జగమ్ములఁ ద్రోసిపుచ్చకే?

నెమ్మిఁ గర్మంది! కర్మయంత్రమ్ము నెక్కి
మానినీముఖరూఢాభిమానయుక్తి
ఘోరసంసారవాపికఁ గూలిననను
నుద్ధరించితివి నుడిచేయూఁత యొసఁగి.

వెనుకటిపుట్టునందు నతివేల మఖండను నైననిష్ఠ నేఁ
బొనరిచియుంటి దుష్కరము పుష్కల ముగ్రతపమ్ము సుమ్ము. పా
వనములు నీదుపాదనవపద్మము లగ్గము లౌనె యట్లు సే
యనియెడ నంబకద్వయికి హంసపురోగసమర్చ్య, శంకరా!

శాంతిప్రాకృతబీజమున్, దమపలాశ, మ్ముగ్రనీరాగతా
త్యంతోత్తాలసుసాలజాలము, తితీక్షామ్లానసూనమ్ము, సు
స్వాంతైకాగ్ర్యమరందపూర, మతులశ్రద్ధాఫల మ్మా భవ
త్కాంతోక్తిశ్రవణమ్ము నేఁటి కొదవెంగా తొంటిపున్నెమ్ములన్.

సురలకుఁగూడఁ గూర్చి పొలుచుం బురుషార్థము లిత్థముల్, సము
ద్ధరణ మొనర్చి పేర్చు భయదంబు భవాంబుధిఁ గూలి కూలనౌ
నరులను దావకీనకరుణాసురసోర్మిళభవ్యదృష్టిని
ర్ఝరణి; మునుంగుచుం బ్రదనఘ! సంతత మందుఁ గృతార్థు లరిమో.

సంయమికులసోమ! సంతతత్వద్రూప
చింత సంతానసత్త్రి తిరుహాంబు,
పరపదప్రద! భవత్పదపంకజద్వయా
న్వాహానందనం బది నందనంబు,
హంసాదికార్చ్య! త్వదారాధనాదిసం
కల్ప మవు ననల్పకల్పవల్లి,
నిర్గుణా, గుణపూర్ణ! నీభవ్యగుణగణ
వర్ణననిరతియే స్వర్ణది యవుఁ,

బూజ్యపద! నీదుపాదసంపూజనంబ
కనుల కగ్గమౌ తనరుస్వర్గంబు కాన
కనవుకన్న లఘువుగ స్వర్గము నదృశ్య
మును ద్వదీయులు నిరసింత్రు మనసులందు.

కావున నే ననూన మయి క్రాలువిరక్తిని బుత్త్రదారవి
త్తావసథంబులం బసుల నార్తిదముల్ గృహమేథికర్మముల్
వే విడనాడి వేఁడితి లలిన్ భవదంఘ్రులె దిక్కటంచు, నో
పావనమూర్తి! ధ్వస్తభవపాశునిఁగాఁగ ననుగ్రహింపవే.

కేవలమర్త్యమాత్రుఁ డపకీర్తికరుండు శ్రుతిస్మృతీతిహా
సావళి కజ్ఞుఁ డీజడుఁ డటంచుఁ దలంచి భ్రమించి తెంతయుం;
బావితవిష్టపావళి ! భవచ్చరణాంబుజదర్శనంబునన్
వావిరి మోహ మేపఱ శుభంబు పదంబు గనంగ నైతి సూ.

అజ్ఞానంబున నంతిమాశ్రమము నింద్యం బంచు వాదించి స
ర్వజ్ఞున్ దూరితి నిన్ను, మన్ననమెయిం బాలింపవే వేగ; నీ
యాజ్ఞాపాలుఁడ శిష్యుఁడం; గరుణ సంన్యాసంబు నిప్పించి నా
యజ్ఞానాంధతమ మ్మడంపఁగదె శుద్ధాద్వైతబోధద్యుతిన్.

మండనునకాశ్రమప్రదానము

ఆతీరునఁ బ్రార్థించిన
నాతాపసమణి ప్రహర్ష మందుచు వానిం
బ్రాఁతి సురేశాభిఖ్యా
ఖ్యాతుఁ బొనర్చె నొసఁగి చరమాశ్రమపదమున్.

దిగ్విజయయాత్ర

మండనపండితప్రవరమాన్య ననూనవివాదవైఖరిం
గండరగండఁడై గెలిచి ఖండితదుర్మతమర్మకర్ముఁ డు
ద్దండవచఃప్రకారుఁడు విధాతృనుతుండు యమీంద్రుఁ డంతటన్
నిండినపేరిమిన్ వెడలె నిస్తులదేశకు దక్షిణాశకున్.

నలు వవు కమ్మ తెమ్మెరల నల్గడలం బ్రసరింపఁజేసి యొ
ప్పులు గులికించుమంచివిరిపూవులగుత్తులలో మరందధా
రలు తమిఁ ద్రావి త్రావి మధురస్వరముల్ దగఁ బాడు తేంట్లపా
టల కిర వైన కానలబెడంగుల కాతఁడు మెచ్చెఁ ద్రోవలోన్.

అట మహారాష్ట్రముఖవిషయమ్ములం ద
మందధిషణావిలాసుఁడు మాన్యయశుఁడు
శంకరుఁడు నిజాశోష్యభాష్యప్రచార
మాచరించి రహించుచు నరిగి యరిగి,

శ్రీ శై ల గ మ న ము

అరవిరిమల్లెపూవుల నొయారము మీఱఁ గదల్చుగంధబం
ధురతరగంధవాహమున ధూతలసత్ఫలవల్లరీమనో
హరతరురాజరాజితము, హస్తిసుమత్సవిదారిశూరకే
సరికులసంకులమ్ము, గిరిశప్రియ, మాయతకందరాఢ్య మై.

అంబరచుంబిమహాశృం
గం, బంబుజసూతిసర్గకార్యకలాపా
డంబరసూచకసంస్థా
నం బవు శ్రీశైల మమరనంద్యుఁడు సేరెన్.

స్వనదుత్తుంగతరంగభంగఘనముల్ సంఫుల్లకల్హారవా
రనటన్మత్తసుమంధయప్రచయసంశ్రావ్యప్రియాలాపశో
భనముల్ సారసకూజితప్రచుర మా పాతాళగంగాధునిన్
వినతుల్ శిష్యులతో వగాహమును సల్పెం దా గిరీట్కల్పుఁడై.

ప్రణమత్సాధుసమూహసంసరణరూపక్షోణిరుడ్బీజభ
ర్జను, మోక్షామృతసంపదార్జను, నతవ్రాతార్జునున్, మల్లికా
ర్జును, శ్రీమద్భ్రమరాంబికాననసరోరుణ్మత్తపుష్పంధయే
శుని, శ్రీశైలనికేతనుం గొలిచెం బూజ్యుం డప్డు సచ్ఛాత్రుండై.

నవమాకందముఖోన్నతక్షితిజకృష్ణప్రహాదినీతీరభూ
మి విశాలమ్ము శిలాతలమ్మునన పేర్మిం దా సమాసీనుండై
చవు లూరన్ నిజభవ్యభాష్యసరణిన్ సారెం బ్రబోధించి మిం
చె వినీతాంతవసాగ్ర్యవర్గమునకున్ శ్రీశంకరుం డయ్యెడన్.

అట నటం గల పాశుపతాదివిమత
వాదుల మెదలంగా నీనివాదమున వి
జితులం బొనరిచి నిజగురుమతకృతాదృ
తుల నొనర్చి పేర్చిరి వినేయులును లలిని.

సన్న్యసించి యాదిమగురుచ్ఛాత్రసృత్తి
నాశ్రయించియు నను వవు నన్యసరణిం
గైకొనియు వారు కుమతాంధకారదూరు
లై వెలింగి రద్వైతబోధార్కదీప్తి.

అడంగెం గణాదనాదినిగమాతిగవాదము రాక లెక్కకుం;
జెడియె మతమ్ము కాపిలము; శీర్ణము లయ్యెను శైవశాక్తముల్;
పొడ వడంగెం గుమారిలసుబోధితపద్ధతి; వైష్ణవమ్ము దా
మడిసెం బులుంగు లే కనుపమానము శంకరువాదముద్ధతిన్.

సద్యస్కాలము విచ్చి చూపటె ప్రణష్టం బౌనుగా కెట్లు శ్రీ
విద్యాశంకర దేశికశ్రుతిశిరోవిస్తారదుస్తారవై
శద్యాను త్తమభేదవాదతపనస్ఫారప్రకాశంబు తాఁ
జోద్యంబై నలుమూలలం బఱవ నెచ్చోఁ నిల్చు దుర్ధ్వాంత మై ?

## గోకర్ణక్షేత్రగమనము

విదితయశోధనుల్ నిగమవేత్తలు ఛాత్రులతో ననూనమై
పొదల ముదం బెదం గదలి పూజ్యపదుండగు గురుం డఖండశ
ర్మదములు తీర్థరాజములు మార్గమునం గల యన్ని చూచు చా
డఁ దనరుదుర్మతమ్ముల నడంచి, నుతించుచు దైవతమ్ములన్,

కలుషపంకప్రదిగ్ధులు కలిజనములు
వేరిరాకాసిమూఁకలబారిఁ బడక
ధాత దాఁచియుంచిన మంచి ధర్మపేటి
యర్ణవాభ్యర్ణగోకర్ణ మలరఁ జేరె.

## గోకర్ణేశ్వరస్తుతి

సామజకృత్తికృత్తపటు, సామెయి కోమలిగాఁ గలాని, సౌ
దామిని మించుక్రొంజెడలదాలుపుఁ, గాలిమ నొప్పుకంటపున్
సామిఁ, బ్రపంచనాటకముఁ జక్కఁగ దిద్దెడు సూత్రధారి, సత్
క్షేమదు, గోశ్రవఃపురనికేతను, నీశు నుతించె నీమెయిన్.

తామరచూలి, మేలివిరితామరపొక్కిలివేల్పు నిచ్చ ను
శ్రీమహిమాభిరామములు చింత్యము లెవ్వనియద్దు లన్న కెం
దామరదోయి స్వీయము మనమ్మునఁ గొల్చుచునుందు రెంచు రే
ఖామహనీయమ స్తక ! అకల్మషభ క్తి భజింతు నిన్ భవా !

తలఁతు నీరూపు నీరదాద్వైతవాద
చతుర మొకవంక, వేఱొకచక్కి నూత్న
చంచలాలతాసాధితసంప్రదాయ
పరిసమర్థనాదేశికవరము పరము.

అల డాచక్కిఁ జివుర్చునంగుతతిత్రుణ్యాన్ మెక్కు నుద్యుక్తమై
వలకేలం గిలిగింతలాడు మృగశాబ మ్మొప్పఁగాఁ జేయు నొ
ప్పుల, నన్యోన్యరుచిప్రరోహకలమమ్ముం గోరి కారాడురా
చిలుకన్ వేఱొకకేలఁ బూని సిరి మించే నీదురూ పెంచెదన్.

మంగళదేవీగళగత
మాంగల్య మెవానికంఠమధ్యతలగత
మ్మంగరముం గడుఁ గుంత
మ్మంగావించె నతనిఁ బరపూరుషుఁ దెలఁతున్.

అని యిమ్మెయిఁ ద్రిగుణాతీ
తుని గోకర్ణేశు సుమహితు నుతించి సుధీ
మణి శంకరుఁ డాక్షేత్ర
మ్మున నిలిచెన్ మూఁడు నాళ్ళు ముద మెదఁ బొదలన్.

## హరిహరక్షేత్రగమనము

తమి వైకుంఠముఁ గైలా
సము నొకచోఁ గూర్చె నొక్కొ జలజజుఁ డన స్థా
నమ వైయె హరిహరులకు క్షే
త్రముఁ దదభిఖ్యం దలిర్చుదాని బిరానన్,

చేరి, మిఱిఁ తా నపారకృపారస
మేదురమున మొనయునాదరమున
దూరితశ్రితార్తిదోషు శ్రీహరిహర
మూర్తి వినుతుఁ జేసెఁ బూజ్యపదుఁడు.

## హరిహరస్తుతి

పరమము, భూతహృత్కుహరవాసము, సోమకలావిలాసముఙ్,
వరకరుణారసాకరము, భవ్యము, గోకలనాప్రవీణముఙ్,
సరసిరుహోద్భవాద్యమరసంస్తుతపాద, మనాదిసిద్ధ మహా
హరిహరిసంజ్ఞకమ్మొ సుమహత్తరతేజము నాశ్రయించెదన్.

త్వర నవిషాదియ వైయె మం
దరాగధరణప్రవృత్తిఁ దనరి నిలింపో
త్కరముల కమృతము నొసఁగిన
ధరలీలోచితమనోజ్ఞతనుఁ డోముత నన్.

మహిమోల్లాసకతావిధానమునసామాన్యమ్ము మాన్యత్వ మొ
ప్ప హితాత్మీయమహార్తిహర్త యవుచుఁ భాసిల్లు నుద్యద్యశో
వహు దుర్వారపరాక్రమక్రమునిఁ గ్రవ్యాద్వారముం గ్రోధవ
హ్ని హుత మ్మాచరియించి మించిన వరాహీశాంగునిం గొల్చెదన్.

మెఱసి కేసరిత్వస్ఫూర్తి మివుల, ననిమి
షద్విషత్కుంజరునసుశ్వసనము లూడ్వ
లావరి యయి ప్రహ్లాదవిలాసకార
ణుండు పంచాననుం గొల్తు నిండుభక్తి.

వామనయనుపే రొప్పార బల్యుపాహా
రణముకొఱ కుదితుఁ డయి చర్మమ్ము దాల్చి
పొల్చి కాంతారహితవృత్తి భూరితప మొ
నర్చినప్రథమాశ్రమివరు నర్చ సేతు.

ప్రథితబలుఁడు, ప్రోద్యత్తరవారి, శీత
కరకలాస్ఫురితుఁ డెవాఁడు కనలుకొని భ
యంకరాయోధనమ్మున నర్జునుం బ
రాజితుం జేసె నతఁ డవుఁ బ్రాఁపు మాకు.

ఒగి నలీకభవమున నిజోరుతేజ
మునన కామద్విషు దశాస్యుఁ గినుకపేరి
చిచ్చునన్ భస్మసాత్కృతుఁ జేసినగడు
సరి ధరాత్మజోరోజోష్మసాక్షి నెంతు.

తలఁతు నుత్తాలకేతుని, ధర్మమూర్తి,
శుద్ధు, రోహిణీశానిశచుంబ్యమాన
మస్తకాన్వితు, ధూతసమస్తకలుషు,
దివ్యు, హాలాహలస్వీకృతిప్రవీణు.

వంద్యు, నాకలితాహితాపమ్మగాఁగ
సంతతిక స్థవినాయకు, నభికలాప
భూషుఁ, బూతనామోహకపుణ్యచిత్త
వృత్తి, నుద్వృత్తదమను, సర్వేశుఁ గొలుతు.

క్రతువిద్వేషకృతాదరు
జితలతికాంతాస్త్రు బోధశేవధిఁ గరుణా
ప్పతి సంప్రతీతసర్వ
జ్ఞతాభిరాము నతసోము సన్నుతిసేతున్.

పాసి మనోవిషయత్వము
భాసిల్లుతమోనిహంత, వరవాహు, సదా
వాసకృతాశయు, ధర్మా
భ్యాసు, నభవుఁ జేరు నాదువందనశతముల్.

మూకాంబాదర్శనము.

ఆ యతిలోకకలానిధి
పాయక ప్రణమిలి వృషాకపాయీపదస
త్తోరుహాంబుల కమలా
ఖ్యాయిని మూకాంబ యున్నయయ్యెడ కెలమిన్ —

## శృంగగిరి ప్రయాణము

చని యయ్యంబికమృదుపద
వనజాతంబుల కెఱంగి భగవత్పదుఁ డా
య్యనఁ గతిపయప్రయాణము
ల నరిగె శృంగగిరికి నమలము యశ మలరన్.

భద్రదములు తుంగభద్రాస్రవంతీజ
లముల మునుక లిడుచు నమలవృత్తి
నుగ్రతపము సలుపుచుండుఁ బేరిమి ఋష్య
శృంగమౌనివరుఁడు శృంగగిరిని.

అచట నభ్యాగతార్చావిధాల్పితసుర
కల్పశాఖిశాఖులు తటంకషముగాఁగ
నెల్లశాఖలు నేర్చిన యీడ్యపదులు
కలరు వేలలెక్కఁగ; వారగణ్యయశులు.

అట నశేష్యము స్వీయభాష్యమును శిష్య
వరుల కర్థి బోధించుచు వాసరములు
కొన్ని సన్నయావల సుఖీసన్నుతుండు
శంకరుఁడు సర్వభువనైకశంకరుండు——

## శా ర దా ప్ర తి ష్ఠ

ఇంద్రవిమానసమానము
సాంద్రశరచ్చంద్రికాప్రశస్తము ప్రాసా
దేంద్రము నిర్మించి యొకం
డింద్రముఖత్రిదశమండలేడితఫణితిన్ —

సామవేదసన్నుత భారతీమతల్లి
నందు నెలకొల్పె; నాతల్లి యాశ్రితజన
కల్పవల్లియై శారదాఖ్యం దలిర్చి
నాఁటినుత నటఁ గనువిం దొనర్చుచుండు.

## హ స్తా మ ల క చ రి త్ర ము

పెరిమ మెఱయు మహాబలిపుర మనంగ
నొక్కఁడు మహాగ్రహారాగ్ర్య; మక్కడఁ గల
కలిమి, విలసనమ్మునవిమ్మఁ, బలుకఁ గలుగు
వలఁతు లేరెడఁ గనరారు కలికమునకు.

ప్రతిగృహమ్మునసుండి వెల్వడెడు హోమ
ధూమములు కెలఁకుల నింప దొరఁకొనినప
రీమళముల బర్హిర్ముఖశ్రేణిమాన
సములు ప్రముచ్చిలి యయది ప్రశస్తి మెఱయు.

ఎలసి యలంతియంతరము నెట్టులొ కొట్టికలోనఁ జొన్పి కా
ఘులు తనచేత కడ్డొకరుఁడుం గనుపింపనియట్లు సేసికోఁ
దలఁచి యకాలమృత్యు వెయిదం బఱతెంచియ పాఱె నూరి కా
వలనన యుండి తా నచటిపాఱులఁ గాంచి స్వధర్మనిష్ఠులన్.

నృపపూజ్యు లవిచ్ఛిన్నా
గ్న్యుపాస్తిపరతంత్రు లాగమోపాధ్యాయుల్
క్షపితాఘులు కల రుర్వీ
సుపర్వు లీర్ష్యలలెక్క చొప్పడ నచ్చోన్.

చెలఁగి నభమ్ముమధ్యమున శీతమయూఖుఁడువోలె యామినిన్,
లలితము తారహారమున నాయకరత్నము నూత్నమట్లు, చ
ల్వలదొరతాల్పు గట్లదొరపట్టియుఁ దోఁపఁగ నూరిమధ్యలో
నెలకొని భాసిలం జలుపు నిస్తుల మా మహాతాగ్రహారమున్.

ప్రథితప్రభావవైభవుఁ
డధీతనిగముఁడు ప్రభాకరాఖ్యానుండై
సుధి గలఁ డాపురి; నాతఁడు
యథావిధి నొనరిచెఁ గ్రతువు లతులయశుండై.

ఎఱుఁగఁ డెందు నోకించుక కొఱఁత యనెడి
నుడియ యాధ్యుఁ డాతఁడు, కాని యుడుగ కెడఁదఁ
గుమిలిచనుచుండుఁ దన కన్నకొడుకు ముగ్ధ
చేష్టుఁడు జడుఁ డనుదురంతచింతఁ దవిలి.

తనుఁజుఁ డతఁడు కనఁడు వినఁడు
కొనం డడుగఁ డిడఁ డొంటేనిఁ గూర్చుండినపా
టన నవ్వును దలపోయును
దనలోఁ దాఁ గనులు మూసి ధ్యానించు నెదో.

మారుఁడు రూపమున, నకూ
పారుఁడు గంభీరతం, దివాకరుఁడు రుచిన్,
ధీరత శైలము, తాలిమి
ధారణి, యాహ్లాదకతను దారాధవుఁ డొ.

సహజమొ, చెడనడఁచెనో గ్రహ మెదేని,
పూర్వకర్మఫలంబొ స్వపుత్త్రుజడత
యెఱుఁగ నేర కతం డగుపించు నెల్ల
పండితులకును జూపుచునుండు వాని.

తివిరి భాష్యప్రచారమ్ముతీర్పఁ దొడిగి
వచ్చి నిసి వినేయులతో దేవలమునందు
విడిసి యున్న శంకరుకత విని బిరాన
లౌకికక్రియాపరుఁడు ప్రభాకరుండు—

తనదునలవాటుఁ బాటించుచును దనూజుఁ
గొనియ పనివిని శంకరగురునియడుగు
దమ్ములకు మ్రొక్కి మ్రొక్కించె తనయు చేత.
ఆతఁ డాతనియడుగుల నట్టె వ్రాలి—

కదలఁడు మెదలఁడు లేవం
డెది యాడఁడు తనజడత్వ మిట్టిద యనుచున్
విదిత మ్మొనరుపఁగా నన
వదలక యవి పెద్దప్రొద్దు పడియుండె నటుల్.

అంతఁ గొంతవడికి నెంతయు నిడుదలు
కనులకొలఁకులందుఁ గడు విడివడి
జాలుగొనుకృపారసంబుపూరంబున
మునుక లిడుచు లోకపూజ్యపదుఁడు—

కమలకోమల మఖిలలోకప్రకామ
కుశలకరణప్రశస్తము కూర్చుహస్త
మునన నిమురుచు వానిపై మొనయుకూర్మి
వత్స! లె మ్మని లేనెత్తె వదల జడత.

అత్తఱినిం జివు రెత్తియు
పాత్త మ్మయిన వినయమునఁ బాణిపుటంబుల్
బత్తిని మోడ్చి ప్రభాకర
విత్తల్లజుఁ డిటులు వలికె వేదగురునకున్.

విదితప్రాభవ! వింటె, పీనికత, ప్రాపింపం జడత్వం బిటుల్
పదుమూఁడేఁడులయాడు పైఁబడియె, నేర్వంబోవఁ డర్ణం బొకం
పుఁ, దయారమ్యో నిపాదుఁడట్లు, తొలిపల్కుల్ దవ్వు లివ్వానికిం,
దుది నెట్లో పొనరించినాఁడ వకుగుణ్ పోనీక బ్రాహ్మణ్యమున్.

బుధసుతుల్ తోడిదయియాడువారు పిలువం బోనంపు క్రీడార్థ; మీ
జడిమం గాంచియు వారలెల్ల రోసఁగ్రై చామోదఁ బొల్పడ్డఁ బ
ల్కఁడు, కిన్కం గొనం డింతయేని; నెపుడుం గాంక్షింపఁడుం గ్రొత్తలా
నుడుపుల్; వర్షము శీత మాతపము చా నోర్చున్ వినమ్రుండ యై.

తనలోఁ దా నగికొంచుఁ గాంచు దెసలన్, ధ్యానించు, మానించుఁ, బ
ల్కును నెవ్వారలొ మ్రోల నున్నయెడలు, లజ్జల్ మానియూఁపుం దలన్,
జను నొక్కండ యొచోటికో, కుడుచు నిష్టంబైనఁ గాకున్న, మ
న్ననఁ గూర్చుండు నొకొక్కవేళ, బుధు లన్నన్ నచ్చుఁ బర్వెత్తుచున్.

సుప్తడింభకముఖబింబచుంబనంబు
విధి వృథా జడుఁ నివ్వాని వెంటన కొని
తిరుగుచుండు నాకన్నకొమరుఁ డనుతలఁ
పునన; యున్న నే తెన్నునఁ గనలుకొనను.

శ్రీదులు, కాలత్రయగతి
వేదులు, గతవిబుధమూర్ఖభేదులు, భగవ
త్పాదులు, వేదజ్ఞుల కే
పేదం జూపితిఁ బలువుర కివ్వాని జనున్.

కాని యవ్వార లేరు నివ్వానితెఱఁగు
నెఱుకపఱచుమేరక నేర; రిపుడు నాదు
పున్నెములు పండె మీకూర్మి నన్ననగుచు
లోకగురుఁడు చీరి జడబాలునకు ననియె.

పొడ వడంగి డాఁగ నొడలికాంతులు పొగఁ
గప్పుపడినయగ్గిచొప్పు చొప్ప
డంగ జడునివఁలె వడర మెలంగెదు నీ వె
వఁడవొ వత్స ! వాస్తవమ్ము సెపుమ.

పొలివో నొండుకతమున వి
కలమై కలరూఢి యొగికకలాపము ము
న్నిల జడభరతుఁడటు పొడమి
అలరెడు యోగి వనుకొందు నన నాతఁ డనుణ్.

శమభూపా ! విను, కాను నే జడుఁడ; మత్సామీప్యవృత్తిఁ సమ
స్తము వర్తిల్లు జడమ్ముగా, జడునిధీజాడ్య మ్మపాస్తమ్మ వే
గమ యా; నూర్ములు భావషట్కవికృతుల్ గైకో కగమ్య మ్మనా
ద్య మనంతమ్ము సుఖైకతానము పరమ్మా తత్పద మ్మేను సూ.

కొని లొకచేష్ట కినుఁడటు
మనోంబకాదిప్రవృత్తిమహితనిమిత్త
త్వనిరతి, మిన్నటు మెయితీ
గ్గొననియజస్రోపలబ్ధిరూపాత్మఁ జుమూ.

అనలు వెచ్చందనమ్ముమచ్చున మనోము
ఖము లబోధాత్మకము లవికంప్య నిత్య
బోధరూపు నెవ్వనిఁ జేరి పొలు పెలయు, మ
హాత్మ ! నిత్యోపలబ్ధిరూపాత్మ నేన.

విను మాభాసక మద్దం
బున మొగమునకన్న వస్తువు మఱొక్కరుఁ డుం
డనిమాడ్కిఁ జిదాభాసుఁడు
కనఁబడు జీవుఁడు తనువుల, ఘన మయ్యాత్మన్.

ఘోరయు దెట్టికల్పనము మోహమున కెవేళ
నద్దమే లేమి నాభాస మసలె సమయు
భాసిలు నుపాధి సెడ నిరాభాసుఁడై యె
వంపు నయ్యాత్మ నేన యఖండతేజ!

ఒగి మనశ్చక్షురాదివియుక్తి నొప్పు
గాని మనశ్చక్షురాదికమున కెవాఁడు
తా మనశ్చక్షురాదియై తవులఁ బోవఁ
డామనశ్చక్షురాది కయ్యాత్మ నేన.

తా స్వతఃశుద్ధచిత్తుఁడు, ద్వైతరహితుఁ
డుం బ్రకాశస్వరూపకుఁడు నయి యునుఁడు
నీళులంబోలెఁ బెక్కుచందాలఁ దోఁచు
నాచిదాకారుఁ డాత్మ నే నవుదు ననఘ!

జలదచ్ఛన్నుఁ బ్రభాకరు
జలదనిరుద్ధాక్షిగతులు జడు లప్రభునిం
బలె మాయావృతు లెవ్వని
నిల బద్ధునిగాఁ దలంతు రే నయ్యాత్మన్.

అలర సమస్తవస్తువులయం దనయ మ్మనపాయియై ప్రవ
ర్తిలుచు నెవాఁడు వస్తువితతిం దవులంబడఁబోఁ డవిక్రియా
కలితుఁడు చిద్ఘనుం డఖిలకారణుఁ డాకస మెట్టు లట్టు ని
ర్మలుఁడు జగమ్ము తాన యయి రాజిలు నాపరమాత్మ నేను సూ.

మణుల కుపాధికల్పితముమాదిరి, భేదము ధీకృతమ్మయై
యెనయును జిద్ఘనుం డెనని, కిందునకుం దరలంబు లంబులం
దునయటు దోఁచుఁ జంచలత, నూల్కొనుకోర్కి ననేకరూపుఁడై
యొనకొను నద్వయుం డెనఁడు పూర్ణత నాపురుసత్త్వఁ డేన కా.

విన నిటు వల్కు నంచితవివేకధనుం డవనీనిలింపరా
ట్తనయుని బ్రహ్మవేత్తృత కెదం గడు నబ్బము సంతసంబునుం
బెనఁగొన దేశికేశుఁడును స్వీయశుభంకృతిశస్తమైన చే
యి నిడెను వానిమస్తముపయిన్ 'భవ బ్రహ్మ పర' మ్మటం చొగిన్.

కొని శ్రమణేశునవిద్యా
ప్రణాశ మాశీస్సు చనెఁ బ్రభాకరసూనుం
డన కెది బిరబిర నిరవున;
కను నంత యతీంద్రుఁ డాధరామరున కిటుల్——

అనఘా! ధన్యుఁడ వైతి, వీతవిషయవ్యాపారు బ్రహ్మణ్యాగ
ణ్యుని వీనిం బడయంగ నోమితి స్వసూనుంగాఁగ; నభ్యస్తముల్
మునుమున్నె కల లెల్లశాస్త్రములు నామూలాగ్రముల్ వీనిచే;
ధనధాన్యాదుల దేహగేహముల నొందంబోఁడు మోహం బెదన్.

నిరతముఁ బరవస్తువునం
ద రమించుచునునికి మనము తనువిస్మృతిచేఁ
బొరసినజడిమం బలుకఁడు
పరికింపఁడు వినఁడు కొనఁడు పడఁడు క్షుధార్తిన్.

ఏతాదృశు నవధూతన్
ధూతప్రాపంచికసుఖదుర్వాసను సం
పూతాత్ముని నీదుతనూ
సూతిన్ నావెంటఁ బనుపఁ జూడు వివేక సుధీ!

తనుధనగేహాదికసం
జనితము విముఖత కతముగ జడిమం గొనునం
దనుఁ డీతఁడు నీ కేలా?
పనిఁ గొని నాతోడ లోకభవికకరుం డౌ.

అని యొడఁబడినయవ్వానియనుఁగుకొడుకుఁ
గూరుచువినేయునిఁగఁ గొనె గురువరుఁడు, వ
లుకుటఁ దత్త్వము హస్తామలకమురకము
సెలఁగ హస్తామలకనామకలితుఁ జలిపి.

### ఆనందగిరిచరితము

అనయము గురునరునిచ్ఛకు
నెనయఁపూజాడం జరించు చేనాఁడుం ద
ప్పనిధర్మువుచొప్పునఁ దవు
వినేయుఁ డొకరుఁడు గలండు ప్రియుఁడు గురునకున్.

అచలతోన్నతతాతిసత్త్వాప్తులందు
గిరి యయి పొడముజడిమ నెల్లరకుఁ గూర్చి
పరఁగు టానంద మానందగిరి యనఁబడి
తొలుత, నాతఁడు తుది నొందెఁ దోటకాఖ్య.

మునిఁగి యేటిలో యమీంద్రునికన్న మునుమున్న
సమ మున్నతము వరాసనము గూర్చు;
సవరించి యుంచు నాశ్రమధర్మమింత పో
ల్వోనితీరునన పల్దోముపుల్ల;
గురుఁ డొనరిచి స్నాన మరుదెంచులోనన
చేర నిండఁగఁ బువు లేరి తెచ్చు;
సుసమాహితము చిత్త మెసఁగ దేశికసార్వ
భౌమోపదేశశ్రవణ మొనర్చుఁ;

గాళులఁ బడఁబోనిలీల నా నీళులు
శంకరచరణాబ్జసంస్మరణప
రాయణతన యుదుకు రక్తశాటిని; నిశి
నడుగు లొత్తు నతఁడు బడలిక సన.

ఛాయ యినునిఁజాయ, మాయ పేరిటిపేర్పి
సాసివాతఁ బడునసదులపాలి
మంత్రగాఁడు శ్రమణమండలాఖండలు
ననుసరించె నతఁ డనల్పభక్తి.

అనఘుఁడగుండు శంకరుఁడు నాతనిసేవల కెంతయేనియుం
గాని యరుసమ్ము నెమ్మది, నకుంఠనిరూఢిని బ్రాఢి నేలి లో
కనికరశంకరత్వమువికాసవిలాసమునందు, శిష్యుఁ డా
తని కుపదేశముం జలిపెఁ దార్కొనుకూరిమి నెల్లశాస్త్రముల్.

శంకరదేశికేశవిలసత్కరుణారససారమే నిరా
తంకనిరూఢిఁ గూరిచినధన్యత కెంతొ విధేయుఁడై, వడిన్
సంకటముల్ దొలంగి చన సంస్కృతితో, గిరి వేదమస్తసా
రాంకితవాక్పరంపరల నాదిగురున్ వినుతించి మించుచున్-

పరఁగుభక్తిఁ బెంచి పరగురుపదసరో
రుహముల కొగి మ్రొక్కె, మహిమ కెక్కె.
ధన్యతముఁ డతనివదనగహ్వరమునుండి
వెడలినస్తుతు లెనసి వినక చెడమె?

అతిపారము ఘోరభవాప్యయవా
స్తతమున్ సుఖదుఃఖఝషంబు భవా
ప్పతిఁ గూలితి, నీమృదుపాదములే
గతి యంటిని బ్రోవు మికన్ గురు! నన్.

కరుణావరుణాలయ! ప్రశ్న భిదా
హారసూక్తిసరోజహితార్చి హృదం
తరమందలి మాయ యనంబడు దు
ర్భర మంధతమ మ్మడఁపంగదవే.

పటుసంసృతివహ్ని నవాక్షరమా
నటు కాలిచి క్లేశము లన్ పెనుస
మ్మెటపోటులఁ గా నులి మే న్నను న
క్కట ! నొక్కడిఁ గాలుఁడు కమ్మరి తాన్.

అమరన్ విషయంబుల నార్జవదూ
రమయా దరినిం దఱిఁ గ్రమ్మరఁ జ
ల్పి మనుష్యతనుస్థిరవృత్తి సుబ
ద్ధమతిన్ విడునట్టిఁడె ధన్యుఁడు సూ.

పోరయున్ భవమూలము వొందక దు
స్తరమోహాతమోహాతి సంతతమున్
పరమాత్మరతిస్థిరభావమునం
బరఁగంగలవాఁ డపవర్గము సూ.

వీతవికారు నఖండు ననం
తు ననాది నరూపు ననూనగుణున్
గుణహీను హృదంతరగున్ నిరత
మ్ము నెఱుంగ నహా మ్మని పోలు మదిన్.

అవు ధీవశమై ఘటికాదికృత
మ్ము వియత్తున కంబుజపూషులకున్
భువనాదివిభేదజముంబలె నీ
కవికార ! బహుత్వ మపా స్తగుణా !

సులలితతోటకవృత్త
మ్ములఁ దత్త్వము నెల్లఁ దెల్లముగఁ బాడుచు ని
మ్ములయుగిరిం గనులం గని
జలజపదాదులు వొరసిరి సంభ్రమము మదిన్.

ఆనందగిరి తోటకాఖ్యం బడయుట

గురుకరుణాపాత్రుం డిటు
గిరి తోటకవృత్తసమితి గిరికొనుశ్రుతివి
త్త రహింపఁగఁ బాడుట ను
ర్వర సార్థకతోటకాఖ్యఁ బ్రథితిం గాంచెన్.

ఇమ్మెయి నమ్మస్కరిర
త్న మ్మన్నిటఁ దనకు నవతు నాఁ దగు శిష్యుల్
సమ్మతిఁ గొలువఁగ శృంగన
గమ్మున నొకకొన్నినాళ్లు గడపెఁ గడంకన్.

రహి మంథానగిరీంద్రసంక్షుభితవారాశిభ్రమీనిర్గళ
ద్బహుళాభంగతరంగసంభవసుధాధారోరుబాహుప్రభా
వహఫేనోపమసాంద్రకీర్తి విమతధ్వాంతార్యముం డుల్లస
న్మహిమాఢ్యుండు జగద్గురుండు విపులన్ భాసిల్లె సచ్ఛాత్రుఁడై.

తలఁపఁ బుమర్థంబులు, ప్రాఁ
బలుకులు, భేదములు ముక్తిపద్ధతి, నలువుల్
నలువమొగము, లని హస్తా
మలకాదులఁ బొగడుచుండ్రు మాన్యు లెవేళన్.

## కాళహస్తిగమనము

ఆవెనుక వసుంధరావలయనిరామ
యంకరుండు గురుండు శంకరుండు
నటనుండి పయనమై యటనట నడచుచుఁ
గామతమ్ములవారిఁ, గాళహస్తిఁ
జేరి శ్రీకాళహస్తిప్రభుకూరిమిఁ
బుండరీకాదికపురములం ద
శేషవిపశ్చిత్ప్రతోషితుం డయి యేగె
రామేశ్వరుం గొల్వ. రహిని నందు

మున్ను తీర్థనిషేవణమునకుఁ జని మ
తిభ్రమణమున వికలుఁడై దిగ్గ మరలి
సవిధమున కవుదెంచినభువనజాత
పదునిచే రచింపించెను బంచపాది.

## శంకరదిగ్విజయము

ఆవల నచోటు వీడి వీడని శ్రుతిమతస్థాపనాదృతి నశేషాశావలయవిజయో న్ముఖత ద్రుతగతిం బయలువెడలి శాక్తమతశకలీకరణంబును, సారస్వత మతనిరాసంబును, వామాచారదూరీకరణంబును, పాండ్యచోళాదివిషయ విశేషంబుల శైవమతనిబర్హణంబును, లింగమతభంగంబును, షడ్విధ వైష్ణవమతనిహింసనంబును, సుబ్రహ్మణ్యక్షేత్రంబునఁ జతుర్ముఖమతా ధోముఖీకరణంబును, అగ్నిరవిమతనిరాకరణంబును, గణేశక్షేత్రంబున

గణేశమతప్రణాశంబును, కాలికమతనిర్మూలనంబును, గౌడదేశవిజయంబును, చార్వాకక్షపణకజైనమల్లారివిష్వక్సేనమన్మథకుబేరేంద్రయమవాయువరుణమతధ్వంసంబును, శూన్యమతఖండనంబును, వారాహమతవినిహ్నవంబును, సాంఖ్యగుణమతశోషంబును, కాపిలమతపాతనంబును, అణుమతచ్ఛేదనంబును, శేషమతభేదనంబును, చంద్రక్షపణకపితృమతభంజనంబును, బాహ్లికావర్తశూరసేనకురుకాశకరూశాదినానావిధవిషయవిజయంబును, అర్థ్వాన్మతనిబర్హణంబును బేరిమిఁ బొనరించి మించి—

అద్వైతమతస్థాపనము

భేదభేదకవేదగభీరవాద
భీకరుం డయి విమతులపోకడలను
దటిమి యడఁచి మడఁచిన యద్వైతగురుఁడు
వసుధ స్థాపించి మించె నద్వైతమతము.

జలజాతప్రభవోపదిష్టము, సుదిష్టంబుం దదీయాత్మజా
వలి, వాల్మీకిముఖార్షిసంచితము, నద్వైతమ్ము శ్రౌతాధ్వ మి
మ్ములఁ గాలించి విభేదవాదివచనంబుల్ పేరివౌ కంటకం
బులు గావించె ముముక్షుపక్షసుగమంబుగా శంకరుం డీడ్యుఁడై.

ఇటు లాశావలయంబునం గనుల కెద్దేఁ గానఁగారానటుల్
చటులద్వైతపథ మ్మడంచి విమలశ్రౌతాద్వయాధ్వమ్ము ప్ర
స్ఫుటరీతిగా వెలుగొందఁజేసెఁ ద్రిజగత్పూజ్యుండు పెంజీఁకటుల్
మటుమాయం బగుఁగా ఖరాంశుఁడు స్వశుంభత్తేజ మె ట్లట్టులే.

## పరమహంస సామ్రాజ్యము

మును పల నారాయణునిచేత నెలకొల్పఁ
బడి పరాశరుకన్నకొడుకు కొన్న
వర్ధనమ్మునకల్మి వర్ధిలి విమలమ్మ,
మహితవైదికధర్మమార్గమునకుఁ
దలపూవు, భారతీకులముగౌరవము మ
ర్యాదయుఁ దప్పఁ బో కవనిధవులు
మునుపటివారలు పనుపడునవ్వాసిఁ
బరఁగి, పరమగురుపదలసితులు

క్ష్మానిలింపశేఖరులు రాజగురువరుల
చెప్పుచేతల మెలఁగి, విశిష్టవృత్తిఁ
బేరుపడి, శ్రుతిస్మృతిసదాచారసరణి
నెఱిఁగి, ధర్మపద్ధతి వెలయించి రెలమి.

కులగురుసేవ లేమఱక క్షోణిపతిప్రవరుల్ పరంపరా
విలసితమైన రాజపదపీఠమునం దనరారి కత్తి వ
ట్టి లలి నడంచివైచుచుఁ గడిందిమగంటిమిఁ గానివారలన్
నిలుపుట ధర్మమార్గమును నిశ్చయమన్నియుగమ్ములందునన్.

పరమహంసలు బ్రాహ్మణుల్ బ్రహ్మవిద్వ
రులు జగద్గురువులు వారలలఁతిఁబోక
మలసి పరమప్రమాణకోటులు సమస్త
మునకు ధర్మమూర్తు లనఁగఁ గొనిరి పెరిమ.

అమరె క్షమామండలమున
సమయం బది పరమహంససామ్రాజ్య మనన్
సుమహితవైదికధర్మము
క్రమమున్ విపులీకరించు రహి ధూర్వహమై.

ఆసామ్రాజ్యము ధర్మ
వ్యాసప్రాజ్యంబు పూజ్య మమరులకును నై
భాసిల్లె నుల్లసిల్లుచు
భూసురవాగ్వైఖరీరమారాజ్యముగాన్.

ఏపారె నయ్యది కలి
ద్వాపరములసంధియందు ధర్మజగుప్తి
శ్రీపరిపాటిః బ్రవృద్ధము
రా పొరయక కొన్నివత్సరమ్ములు కలిలోన్.

రాను రాను మతాంతరాశ్రయముపేరి
పెద్దరోగముబారిని మొద్దులైన
యేలికలయేలుబడిఁ బడి పీలికలయి
మూల మంట నశింపఁగాఁ బాలుపడియె.

మగధరాజులరాజ్యమ్ము మాట మాసి
చన్నపిదప నేకలులదౌ సాఁకతమ్ము
క్షమకు నేర్పడినంతన సన్నగిల్ల
సాగె భారతీకులకీర్తి, తృప్తపగురుత.

అట్టితఱి వేదచోదితమైన ధర్మ
మును బ్రతిష్ఠించి కలిమలమ్మునన ఘూయఁ
బడినపుడమి సముద్ధరింపఁగ యతీంద్రుఁ
డవుచు శంకరగురువరుఁ డవతరించె.

వసుగై యెదవునేట, నెన్మిదిద యా వర్షంబునన్ వేదముల్
కడఁకన్ నాలుగు నేర్చి, పేర్చి, యతియై, కాశిం బ్రవేశించి, పే
ర్వడి విశ్వేశ్వరుకూర్మిఁ, గూరిచి మహాభాష్యాదికమ్ముల్, మదిం
దొడి యీసున్ విమతమ్ములన్ మడఁచుచున్ నూల్కొన్నవాదంబునన్,

ప్రథితుఁ డతఁ డాశలం గెల్చి భారతోర్వి
యందు వైదికధర్మరహోదరమున
నలుదెసల నెలకొల్పి తా నాల్గు పీఠ
ములను నిలిపె శిష్యుల గురువులుగ నందు.

పీఠనిర్మాణము

తవి తన పదునెన్మిదవునేట మాఘమ్ము
శుక్లస ప్తమియం దవిక్లబమున
ద్వారకాపురమున శారదాపీఠమ్ము
వెలయించి, యటఁ గరామలకనాము
నాచార్యుఁ బ్రతినిధి నాచరించి రహించె;
నిరువదిమూఁడవునేటఁ బుష్య
మాసమ్మునం బూర్ణిమ నమర్చి బదరికా
శ్రమమున జ్యోతిర్మఠమును, నందుఁ

దోటకాచార్యు శాసించెఁ; దొడి యిరువది
నాలుగేండ్లప్రాయము జగన్నాథమున వ
రలిచి గోవర్ధనమఠమ్ము రాధశుక్ల
దశమి, నటఁ బద్మపదుఁ బ్రశాస్తం బొనర్చె.

ఇరువదైదేండ్లతటి శృంగగిరినిఁ బుష్య
పూర్ణిమం దమి శ్రీపీఠమును నమర్చి
నిలిపె నందు సురేశ్వరు నిగమగురుఁ డొ
నరిచి నిఖిలభారతవర్షగురువరేణ్యు.

పరమహంససామ్రాజ్యమ్ముపట్టమందు
నందుకొనఁప్రౌఢి నభిషిక్తు నాచరించి
గురుకులేశు సురేశు శంకరగురుఁడు జ
గములచుట్టమయ్యె విమతతమ మడంచి.

మహితవైదికధర్మమార్గమ్మునకు నతం
సనుమమ్ము భారతీసంప్రదాయ
మును లెస్స విపులమ్ము నొనరిచి భారత
విపులలో ధర్మమ్ము వెలయుపేర్మి
శ్రుతులకు స్మృతులకుఁ జొప్పడి సరిపడు
వరుస సదాచారసరణి నేలు
నిర్మలాశయమున నిర్మితమ్ములు పీఠ
ము లవియుఁ గడు విభాసిలెఁ బ్రశస్తి.

శృంగగిరిఁ గలట్టి శ్రీపీఠ మవ్వాని
యం దమందయశము నొంది దెసల
నవఘుళించె నెటి సురాలయమ్మును సురే
శాభిపాలనమున శోభ హెచ్చి.

సర్వజ్ఞపీఠవృత్తాంతము

అమరున్ ద్వీపవతిన్ ద్వీ
పము జంబూనామకంబు ప్రథితంబై. దే
శము కాశ్మీరంబం దు
త్తమ మవుఁ. గృతసవిధ శారదాదేవి యచోన్.

మాంటపద్వారరాజముల్ మహితము లయి
నలువలంకుల నలువారు నాల్గు నలుమొ
గముల వేలుపుకూరుచు కలికిమన్న
సరవి నెలకొన్నయాదివ్యసదనమునకు.

అం దమందము ప్రఖ్యాతి నతిశయిల్లు
సర్వము నెఱుంగనేరుచు సజ్జనాగ్ర
గణ్యునధిరోహణమునక కల్పితమ్ము
విశ్వవిదితము సర్వజ్ఞపీఠవరము.

పెరయఁబోఁడు తత్ప్రవేశమేని నెనాఁకు
నఖిల మెఱుఁగనేరనట్టియలఁతి.
వలఁతు లన్నిట నట నలరుపండితచంద్ర
మసుల నెదిరి గెలుచుమనుజుఁ డున్నె ?

లలిఁ బ్రాగాదిద్వారం
బుల నాయావిషయరాజముల సంఖ్యావ
త్కులతిలకులు లోఁగొనిరి స
కలకలలం దారితేరి కన కోటు నెటుల్.

తప్పఁ బినద్ధమై పెతరులవేలుపుదెస
నెసఁగువాఁకిలి. రస ననము బరువఁ
దెరువ రాఁడు దాని వెరవరి యొకరుఁడు
దాక్షిణాత్యుల కది త్రపయె కాదొ.

కాశ్మీరగమనము

ఆయది త్రోసివైవ మెయి నందినయాగమమ స్తసంచయుం
బాయతకీర్తి దేశికజనాగ్రణి యప్రతిమప్రకారకం
బై యిపురించుచాతురి ననావృత యాయది యాచటింపఁగా
నాయెడకుం బయల్వెడలి సాంతవసుంఘగ నేఁగె వేగమే.

పరఁగుమగంటిమిఁ జముని వైపున మూసియున్నద్వారముం
దెరువఁగలాఁడు దక్షిణపుదేశమునం గనరాఁడు నిక్క మొ
క్కరుఁ డనుకింపదంతి కడఁకం గడముట్టఁగఁ జేయు లోకశం
కరచరణుండు శంకరుఁడు గన్నన దానిని డాయఁబోయెఁ దాఁ-

"పరఁగి సమస్తవిత్త ద్వయవాదిమదద్విపగర్వకర్షణో
ద్ధురతరదేశికేశహరి తూర్ణగతిం జనుదెంచె ద్వైతదు
స్తరగహానంబు డం బెసఁగ ధ్వంసము సేయుఁ బరుంగువారుఁడీ
యరయక యిట్టు నట్టు విమతాశ్రితనామకకృష్ణసారముల్!"

అని యుచ్చైఃస్వరమున నను
వినేయవర్గముతో డాయ వేంచేయుయతీం
ద్రు నిరోధించి సగముత్రో
వన వాదిజనమ్ములిట్టులు నలికిరి పెలుచన్.

వాదిపరాజయము

చనునె ససంభ్రమకృతి యి
ట్టినెటిం బరఁగునది, కపటవడిం దెలుపుము పూ
నినసీకర్జముచో, ప్రా
ప్పినరూపునఁ దీర్తు ముదటు, పీడు మొడందన్.

సర్వ మెఱుఁగుదు, లేదు లేశంబయేని
నెఱుఁగరానిది నా కనుదేనిఁ బూని
భేదవేదవాదమునఁ బ్రవీణుల మము
గెలిచి పీఠాధిరోహము సలుపుమయ్య.

అనుచు నుద్ధతులు కణాదపురోగవి
మతకృతాశయులు స్వమతరహస్య
ముల నడిగిరి తల వగులుచుప్రశ్నమ్ములఁ
బొనరుపం బరాఙ్ముఖునిని వాని.

పొరి నెల్లకలలఁ దడవని
తెరువునఁ దవును త్తరంబు దిగ్గ నిడునిప
ద్గురుచరణమ్ముల నవనత
శిరులై యవ్వారు భక్తి చివురుదొడంగన్,

తెఱచియ తద్ద్వార మ్మే
డ్తెఱఁ జూపిరి పీఠమునకుఁ దెరువున్ ఋషులన్
మెఱసి తదధిరోహేచ్ఛం
గఱఁగట కరిగె గురువరుఁ డకుంఠయశుం డై.

సర్వజ్ఞపీఠారోహణము

అనువున నచ్చటివాదులఁ
బొనరించి నిరుత్తరులను బూజ్యపదుం డ
య్యనఘుఁ డఖిలజ్ఞపీఠ
మ్మున నధివసియించెఁ బొగడ బుధమండలముల్.

అడఁగె నేమూలనో యడుగునఁ గనువాని
కత; కాపిలమురూపు కానరాదు;
కరువలిం బడి ప్రభాకరసూక్తి సనె; భట్ట
పాద ప్రవాదంబు పరువుదొఱఁగెఁ;
పాతంజలప్రోక్తపద్ధతి యుద్ధతి
విడిచెఁ; గాణాదమ్ముపోడ వడంగె;
కుపితమై కుయ మొందె క్షపణకసరణి; పు
లుంగు మాసిపు క్రుంగె లింగమతము;

భయదపాషండతండదుర్ధ్వాంతపటల
చండకిరణుండు యతికులాఖండలుఘున
వేదబాదసముద్ధారిపిజయదుండు
భిన్నవ మ్మనూనమ్ము దిగ్విథిఁ బర్వ.

పొరిఁ గ్రతుమనోరథధురం
ధరనిర్జరనికరపాణితలతాడితబం
ధురదుందుభిరావము శం
కరపీఠారోహవేళఁ గాశ్యపిఁ గ్రమ్మెన్.

### సురలపుష్పవృష్టి

ఒకఁడు మిన్నుల్పక పౌలో
మిని వేలుపు లేరి తెచ్చి మిన్నులం దమి క
ల్పకసుమములు నవములు దే
శికవరుశీర్షమునఁ గురిసి ఘనసిరి వాసిన్.

### బదరికాశ్రమగమనము

అవల వెంట రా నొకకొంద ఱతివిధేయు
లౌ వినేయులు కదలి బుధార్చ్యపదుఁడు
శ్రమణజనతాశ్రయము భవశ్రమశమమ్ము
బదరికాశ్రమముం జేరె ముదము పొదల.

ఆయెడ నశోష్యభాష్యముఁ
బాయక బోధించి యోగపథవర్తనులన్
స్వీయము మతమునఁ జేరిచి
ధ్యేయపదుం డతఁడు కొనెఁ దదీయప్రణుతుల్.

తిపిరి శారదచంద్రచంద్రికల బెడఁగు
లవఘుళించునుజ్జ్వలకీర్తి నలిశయిల్లు
దేశికేశుఁడు నిగమోపదేశకలనఁ
గ్రాలుచుం గాల మాయెడఁ గడపెఁ గొంత.

ఆయుః పూర్తి

కలికలుషాపహములు కే
నలకైవల్యప్రదత్వభానితములు ని
స్తులములు పటుఘటనలలో
పల ముప్పదిరెండునేండ్లప్రాయము నిండెన్.

ఘనసుధీభాష్యంబు కైవల్యమూల్యంబు
సూత్రభాష్యం బయ్యె సూత్రితంబు;
భ్రష్టప్రణతికృతపండితమండలా
హంత ఖండిత మయి యంత మొందె;
నలువలంకులు దాఁటి జలధినీళులఁ బడె
ద్వైతపథంబు సంబాధిత మయి;
దుర్వ్యాక్రియాపంకదుష్టత్రయీభిత్తి
తనరె సూక్తిసుధాసుధవళిత మయి;

విమతములవేరిదుష్కంటకములు వేద
వాదవహ్ని నాచరియించి బసుమ మసమ
ముక్తిమార్గమ్ము సుగమమ్ము పొనరించె; నెది
కావలయు నిల కింక శంకరునివలన !

భువి మందారసుధాసుధాకిరణరుజ్ముక్తాశరన్నీరధృ
న్నివహక్షీరపటీరహీరవిహారన్నీహారతారావలీ
నవకాశప్రతిమానకీర్తిభరమై నల్వారుకారుణ్యవా
రి విపశ్చిజ్జనదైన్యదుస్తరదవార్చిం బేర్చి చల్లార్చెఁ దాన్.

తమ్ములకుఁ దమ్ము లవు స్వపదమ్ము లునిచి
పరమపానస మొనరిచె భారతోర్వి;
నెలసి రాశ్రితు లుపదేశకలనఁ జారి
తార్థ్యు; మే మొనర్ప నవు నయ్యతిపుఁ డింక ?

కేదారగమనము

ఇటు లాయువు పరిపూర్ణ మ
గుటఁ బూర్ణాశయుఁడు లోకగురుఁడు శ్రుతిశిరః
స్ఫుటపరమార్థజ్ఞుం డ
చ్చొటు వాసి మెయి విడుచుతమి చొప్పడ నెడఁదన్,

భూరితరాఘౌఘోచ్చయసం
హారం బాపద్విదార మాశ్రితశుభవి
స్తారాధారము శ్రీకే
దారము భవవారిరాశితారము సేరెన్.

సిద్ధి

అనుపుపడుపేర్మి నయ్యెడ
వినుతుఁడు యతివంశవనధివిధుఁ డవ్విధినిం
బొనరుపఁ గృతనిశ్చయుఁ డయి
కనుఁగనఁ దా మూసె యోగకలన సెలంగన్.

*                *

అఖిలగురు! సముపాత్తలీలావతార!
శంకరా! లోకశంకర! చటులవిమత
పంకపంకిలదిగ్భిత్తిభాగజీవ
నాయమానసుచారిత్ర! గేయవిభవ !

*                *